


సంపుటి:1 సంచిక: 3 పుటలు:68 విడి ప్రతి వెల: 25 రూ. మార్చి 2015

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!

సందర్శించండి: http://kottapalli.in/2015/03/welcome

లైసెన్సు వివరాలు: http://creativecommons.org/licenses/by-nc-sa/4.0/

**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702677670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**Title Verified By RNI**
APTEL/14249/01/1/2014-TC

**సంపాదకులు:** నారాయణ శర్మ

**గౌరవ సలహాదారు:** యు. సుబ్బరాజు

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**సహకారం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

వీరాంజనేయులు: 7799260684

అడవి రాముడు: 9491870753

ఫైనార్ట్స్ చదువుతున్న ఇతర మిత్రులు కూడా.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

కె. మల్లికార్జున: 9000453887




# విషయసూచిక



# అయ్యవార్లకు పరీక్షలు!

కథియవాడ బడికి ఇన్స్పెక్టరుగారు వచ్చారు. ఆయన వస్తున్నట్లు ఎవరికీ ముందుగా తెలీదు. ఆ రోజుల్లో ఇన్స్పెక్టర్లు అందరూ ఇంగ్లీషు వాళ్ళు. వాళ్లని చూస్తే అధ్యాపకులకు అందరికీ వణుకు. స్కూలు ఇన్స్పెక్టరుగారి మెప్పు పొందటం అవసరం- లేకపోతే వాళ్ల ఉద్యోగాలు ఊడేవి! ఆ వచ్చే కొద్దిపాటి జీతమూ రాకపోతే కుటుంబం గడవదు కూడాను!

ఇన్స్పెక్టరుగారు వచ్చి 'తరగతి ఉంచుకున్న తీరును గమనిస్తారు; పిల్లల శుభ్రతని చూస్తారు; మంచి మంచి వాక్యాలు గోడలకు వ్రేలాడుతున్నాయా, లేదా? వివిధ ప్రపంచ దేశాల మ్యాపులున్నాయా? "బ్రిటిష్ రాజు గారు వర్ధిల్లాలి" అని నేర్పుతున్నారా, లేదా? అన్నిటినీ మించి- సరైన ఇంగ్లీషు నేర్పుతున్నారా, లేదా?' అని పరిశీలిస్తారు. పిల్లలకు డిక్టేషను ఇస్తారు; వాళ్ళు రాసినవాటిని స్వయంగా దిద్దుతారు; పిల్లల స్థాయి ఎలా ఉందో చూసి, దాన్ని బట్టి అయ్యవారి విలువను అంచనా వేస్తారు.

పిల్లలు జవాబులు బాగా చెప్పకపోతే, తప్పులు రాస్తే, అయ్యవార్లకు చీవాట్లు తప్పవు. పిల్లలు

మరీ ఘోరంగా ఉంటే అయ్యవారిని మార్చేస్తారు- పనిలోంచి తీసెయ్యచ్చు కూడాను!

ఇన్స్పెక్టరుగారి పేరు గైల్స్ దొర. బడిలోకి వచ్చీ రాగానే పరిసరాల్ని గమనించాడాయన. ఆ వెంటనే చకచకా ఆరో తరగతిలోకి వెళ్ళాడు. అక్కడున్న టీచరుగారు ఆయన్ని చూడగానే తను చెబుతున్న పాఠం ఆపి, లోనికి ఆహ్వానించారు వణుక్కుంటూ. పిల్లలందరూ లేచి నిలబడి 'గుడ్ మార్నింగ్' చెప్పి, 'గాడ్ సేవ్ ద కింగ్ (బ్రిటన్ జాతీయగీతం) పాడారు.

ఇన్స్పెక్టరుగారు పిల్లలందర్నీ దూరం దూరంగా కూర్చోబెట్టారు. పలకలు తీయమని ఐదు పదాలు డిక్టేట్ చేశారు- అయ్యవారికి సంతోషంగానే ఉంది- "ఈ పదాలన్నీ తను చెప్పినవే; పిల్లలందరూ వీటిని సరిగ్గానే రాస్తారు. తనని ఇన్స్పెక్టరుగారు మెచ్చుకుంటారు బహుశ:. తరగతి గదిలో వెనకవైపుగా ఉండి, ఎవరు ఎలా రాస్తున్నదీ చూడసాగాడాయన.

ఆరో తరగతిలో కొత్తగా చేరిన వాళ్ళల్లో మోహన్‌దాస్ అని ఓ పిల్లాడుండేవాడు. కొంచెం వెనకబడినట్లుండేవాడు. వాళ్ల నాన్న కరంచంద్ గారు కథియవాడ్ మహారాజావారి ఆస్థానంలో పెద్ద ఉద్యోగి. మోహన్‌దాస్ ఒక పదాన్ని తప్పుగా రాశాడు: "kettle" అని రాసేబదులు "ketle" అని రాశాడు. అయ్యవారు వెంటనే మోహన్ ప్రక్కకొచ్చి నిలబడ్డారు- కొంచెం ముందుకెళ్ళి వెనక్కి తిరిగారు- కేవలం మోహన్‌కే కనబడేట్లు సైగ చేశారు- "ప్రక్కవాడి పలకలో చూడు- చూసి, సరిగ్గా రాయి!" అని.

మోహన్‌దాస్ అమాయకుడో, మరేమో, అధ్యాపకులవారి సైగలు అర్థం కానట్లే ఉండిపోయాడు- దిక్కులు చూసుకుంటూ.

తర్వాత ఇన్స్పెక్టరుగారు అందరి పలకలూ దిద్దారు- మోహన్‌దాస్ తప్పిస్తే అందరూ అన్ని పదాలూ సరిగా రాశారు. అతనొక్కడే- 'కెటిల్' అని రాయలేకపోయాడు! అందరూ తననే చూస్తుంటే మోహన్‌దాస్ సిగ్గుగా తలవంచుకొని కన్నీళ్ళతో నిలబడ్డాడు.

ఇన్స్పెక్టరుగారు వెళ్ళాక, అధ్యాపకులవారు మోహన్‌ని కసిరారు- "నేను సైగలు చేస్తూనే ఉన్నాను కదా, ప్రక్కవాడి పలకలో చూసి కాపీ కొట్టమని?! అది కూడా రాకపోతే ఎలాగ?" అని.

ఆ మోహన్‌దాసే, పెద్దయ్యాక, తన ఆత్మకథలో ఈ సంగతి చెబుతూ "చిన్నప్పటినుండి నాకు సత్యం పట్ల ఆకర్షణ ఉండేది- నాకైనేను సత్యంగా ఉండటం, ఇతరులతో ఎప్పుడూ నిజమే చెప్పటం, భగవంతుడి పట్ల నిజంగా ప్రవర్తించటం- వీటి వల్లనే నా ఆత్మకు బలం చేకూరింది" అని రాసుకున్నాడు.

ఇంతకీ మోహన్‌దాస్ ఎవరో గుర్తు పట్టారా? మన జాతిపిత, మహాత్మా గాంధీ!

పిల్లలకి నిజాయితీ గురించి చెప్పేటప్పుడు సాధారణంగా ఈ సంఘటనను గుర్తుచేసు-కుంటుంటారు అందరూ.

అయితే, ఇంతకీ ఈ కథలో ఇన్స్‌పెక్టరుగారు పరీక్ష పెట్టింది ఎవరికి? పిల్లలకా, అధ్యాపకుడికా? పైకి చూసేందుకు 'ఆ పరీక్ష పిల్లలకే' అనిపిస్తుంది; కానీ నిజానికి ఆ పరీక్ష అధ్యాపకులకు! పిల్లల స్థాయిని బట్టి అధ్యాపకుల జ్ఞానాన్ని, ప్రతిభను అంచనా వేయచ్చు!

ఇవాల్టి పరీక్షలలో అలాంటి స్ఫూర్తి ఒకటి రావటం అవసరమేమో అనిపిస్తుంది. పరీక్షలు ఉన్నది మన పిల్లల్లో సింహ భాగాన్ని దోషులుగా నిలబెట్టి వాళ్ల లోటుపాట్లని బహిర్గతం చేసేందుకు కాదు; ఎవరో కొందరు పిల్లల్ని మునగ చెట్లు ఎక్కించేందుకూ కాదు- వారికి విద్యగరిపిన అధ్యాపకుల ప్రతిభను గుర్తించేందుకు అవి గీటురాళ్ళు' అనుకుంటే కొంత బాగుంటుందేమో. 'పరీక్షల అసలు పరమావధి విద్యార్థి కాదు- అధ్యాపకులే' అనిపిస్తుంది- మీరేమంటారు?

విద్యార్థులకు ఇష్టంగా విద్యగరపే అధ్యాపకులకు నమస్కారాలు!

కొత్తపల్లి బృందం

నవ్వు!

**సూపర్ బద్ధకం**

పేషంట్: డాక్టరు గారూ! నాకు బద్ధకం మరీ ఎక్కువైందండీ! ఏదైనా మందు ఇవ్వండి.

డాక్టరు: ఆ సంగతి మీకు ఎలా తెలిసింది? మీ బద్ధకం ఎలా ఉంటుందో చెప్పండి.

పేషంట్: ఇంతకు ముందు నిద్రలో నడిచేవాణ్నండీ, ఇప్పుడు బద్ధకం ఎక్కువై అదీ మానేశాను!



# నీతి చంద్రిక

సంధి-10

*జరిగిన కథ : నెమలిరాజుకు "మోసపోయిన బ్రాహ్మణుడి కథ" చెప్పి, 'హంసరాజుతో సంధి చేసుకోవటమే మంచిది ' అన్నది. మంత్రికూడా అదే చెబుతుండటంతో నెమలిరాజు ఆలోచనలో పడ్డది. ఇక చదవండి, నీతిచంద్రిక 57 వ భాగం...*



మేఘవర్ణుడు చెప్పిన కథను సావధానంగా విన్న నెమలి రాజు చిత్రవర్ణుడు కొద్దిసేపు ఆలోచించి, తల ఊపి, "అయినా, ఒక్క నిమిషం పాటు శత్రువుతో కలిసి ఉండటమే గొప్ప కష్టం వచ్చి మీద పడ్డట్లుంటుందే, మరి నువ్వు అంతకాలం పాటు ఆ హంసరాజు హిరణ్యగర్భుడి ఇంట్లో నిర్భయంగా ఎట్లా ఉన్నావో, తలచుకుంటేనే

ఆశ్చర్యంగా ఉన్నది.

క్రూరులూ, భయంకరులూ అయిన ఆ శత్రు మూకల మధ్యన నువ్వు అంత ధైర్యంగా ఎట్లా ఉండగల్గావో చెప్పు!" అన్నది.

మేఘవర్ణుడు అప్పుడు చిరునవ్వుతో మహారాజుకు నమస్కరిస్తూ, వినయంగా "ప్రభూ! 'పనిని నెరవేర్చుకోవాలి' అని అనుకున్నవాడు ఎవడైనా తన శ్రమను చూసుకోకూడదు- ఎవ్వరు ఎన్ని బాధలు పెట్టినా ఓర్చుకోవాలి. అవసరమైతే శత్రువును భుజానికి ఎత్తుకొని మోసి అయినా సరే తన కార్యాన్ని నెరవేర్చుకోవాలి. గతంలో ఒక ముసలి పాము తన అవసరం కొద్దీ కప్పలను తన వీపు మీద పెట్టుకొని మోసి, చివరికి తన సంకల్పాన్ని నెరవేర్చుకోలేదా? ప్రభువుల-వారికి ఆ కథ చెబుతాను- చిత్తగించండి" అని పాము-కప్పల కథ చెప్పసాగింది.

**పాము-కప్పలు**

కాంచీపురం సమీపంలోని పాడుబడిన అడవిలో ఎంతో కాలంగా నివసిస్తూండేది. 'మందవిషం' అనే ఓ ముసలి పాము. ఒక రోజున మధ్యాహ్న సమయంలో అది ఆహారం వెతుక్కొనేందుకు బయలుదేరి పోయింది.

అక్కడ దానికి 'కప్పల బెకబెకలు ఆకాశాన్నంటగా గంభీర జలాలతో విలసిల్లుతున్న' గొప్ప సరస్సు ఒకటి కనబడింది.



"ఈ కప్పలన్నిటినీ తినగల్గితే ఎంత బాగుంటుంది! ఊరికే సరస్సులోకి దూకటం కాదు- మరేదైనా మార్గం ఆలోచించాలి" అనుకొని, అది ఆ సరస్సు ఒడ్డున నేలమీద పడగ వాల్చేసి, వ్యాధి పీడితమైన దాని మల్లే మూల్గుతూ పడి ఉన్నది.

దాన్ని చూసి అక్కడి కప్పలరాజు, జలపాదుడనేవాడు- దాని దగ్గరికి వచ్చి, "ఓ సర్పరాజా! నువ్వు తలచుకుంటే మహాబలవంతుడైన వాయుదేవుడిని సైతం ఒక్క గుటకలో మ్రింగివేయగలవు. అట్లాంటి నువ్వు, ఇక్కడ కప్పలు కుప్పలు తిప్పలుగా నీకు ఇంత దగ్గరలో, నిన్ను ఆనుకొనే దూకుతుంటే కూడా తినకుండా, కళ్లలో ప్రాణాలు పెట్టుకొని పస్తు పడి ఉండటం నాకు ఎంతో వింతగా అనిపిస్తున్నది. దీనికి ఏదైనా కారణం ఉందా, చెప్పు!" అన్నది.

అప్పుడు ఆ కాలనాగు "అయ్యో! కప్ప రాజా! నాకు ప్రాప్తించిన దుర్దశ ఎట్లాంటిదో నీతో ఎట్లా చెప్పమంటావు?! ఇంతవరకూ నేను ఏనాడూ పొట్ట పోసుకోవటం కోసం 'దేహీ!' అని ఒక్కరిని అడుక్కున్న వాడిని కాదు- ఇప్పుడు నాకు మీలాంటి వాళ్లను సేవించి పొట్ట పోసుకోవలసిన గతి పట్టింది. వెయ్యి మాటలెందుకు? ఇకమీద నేను మీ దాసుడిని- మీరు అనుగ్రహించి భోజనం పెడితే తింటాను; లేకపోతే వస్తుంటాను.

ఎందుకో చెబుతాను వినండి- నిన్న అర్థరాత్రి నేను ఆహారం కోసం తిరుగుతూండగా బ్రాహ్మణ పిల్లవాడొకడు అటుగా వచ్చి, దురదృష్టం కొద్దీ నా తలమీద అడుగువేశాడు. ఆ అవమానాన్ని సహించ-లేక, నేను కూడా 'బుస్సు'మని విషం క్రక్కుతూ ఆ పిల్లవాడి కాలు పట్టుకొని తటాలున కరిచాను.



కాటు తిన్న ఆ బ్రాహ్మణ బాలకుడు భయంతో అరుచుకుంటూ ఇంట్లోకి పరుగెత్తి తండ్రికి సంగతంతా తండ్రికి చెప్పాడు. అంతలోనే విషప్రభావం కొద్దీ వాడు క్రిందపడి కంటి రెప్పలు మూస్తూ, తెరుస్తూ మూర్ఛపోయి, నోట్లో నురుగులు క్రక్కి

చివరికి కళ్లు పూర్తిగా తేలవేశాడు.

బ్రాహ్మణుడు కూడా కొడుకును తొడలమీద పడుకోబెట్టుకొని, అంతులేని దు:ఖంలో మునిగిపోయి, పలు విధాలుగా ఏడవటం మొదలుపెట్టాడు. అప్పుడు అతని బంధుజనం అంతా వచ్చి చూసి, అతనికి ధైర్యవచనాలు చెప్పి పంపితే, అతను ఆ అర్థరాత్రి వేళ చిమ్మచీకట్లో, ఉరికంబం ఎక్కేవాడి కాళ్లు ముందుకు సాగనట్లు, ముందుకు పోనంటున్న పాదాలను ఈడ్చుకుంటూ పోయి, ఒక విషవైద్యుడిని పిల్చుకువచ్చాడు.

తన పిల్లవాడిని ఆ వైద్యుడి కాళ్ల మీద పడేసి, "ఇదిగో, ఇకమీద వీడు నీవాడే; మావాడు కాదు" అని మొత్తుకున్నాడు. చివరికి ఆ వైద్యుని కృపవల్ల విషం విరిగి ప్రాణాలతో లేచి కూర్చున్న కొడుకును చూసి మనసులో ఉవ్వెత్తున సంతోషం పెల్లుబడగా, "వీడు మీరు పెట్టిన ప్రాణమే, మీ చలవే!" నని ఆ వైద్యుని గొప్పదనాన్ని వేయి నోళ్లతో పొగిడి, సాగనంపాడు.

అంత జరిగినా నామీద ఆగ్రహం చల్లారక, బ్రాహ్మణుడు నన్ను శపిస్తూ "ఓ నాగమా! పున్నమినాటి చంద్రబింబాన్ని పోలే యీ అమాయకపు పిల్లవాడి మొహం చూసి దయ పుట్టటానికి బదులు, వాడిని కాటు వేసేందుకు నీకు మనసెట్లా వచ్చింది? ఎప్పుడూ బొరియల్ని, లోపాల్ని వెతకటమే పనిగా, వంకరటింకర బ్రతుకును యీడ్చే మీ పాపపు (పాముల) జాతికి- మీకు దయ ఎందుకు కల్గుతుందిలే! ఎలాంటి కారణమూ లేకుండా యీ విప్ర బాలకుడిని కరిచిన ఈ పాపం నిన్ను వదలకుండుగాక! అది నీ శరీరమంటా చుట్టుకొని, నీ అహంకారపు బురద అంతా ఇంకిపోయేంత వరకు, నీకు అహారంగా ఉండే కప్పలకే నీ చేత ఊడిగం చేయించుగాక! ఆ కప్పలు నీ పడగపైకి ఎక్కి ఊరేగి, దయతో ఏమైనా ఆహారం పెడితే, ఆ ఆహారం మాత్రమే నీకు అరుగు గాక!" అని రోషావేశాలతో అరిచాడు.

పాముల కష్టాలెంతటివో నీకు ఏమని చెప్పాలి? మీద పిడుగు పడ్డట్లు ఆ శాపపు పలుకులు నా చెవుల్లో పడి, నా హృదయాన్ని

ముక్కలు ముక్కలు చేశాయి. నా ఒళ్ళు నా వశం కాకుండా అయ్యింది. దాంతో కాళ్లులేని వాడిలాగా కదలలేక, మెల్ల మెల్లగా ప్రాకుతూ మీ కృపా-కటాక్షాలకోసం ఇట్లా వచ్చాను. దైవం చేత కూడా తిరస్కరింపబడి, మీ పాదాలను ఆశ్రయించుకున్న నా చేయి విడువక, నన్ను మీ వాహనంగా చేసుకొని, ఇంత ఆహారదానం చేస్తూ కాపాడితే, నేను ఎప్పటికీ మీ పాదాలను సేవించుకుంటూ నా యీ పాడు బ్రతుకును వెళ్లదీస్తాను!" -అనేసరికి జలపాదం ఉప్పొంగి పోయింది.

'వాహనాన్ని అధిరోహించనున్నాను!" అనే ఉత్సాహం దాన్ని గుడ్డిదాన్ని చేసింది; దాని వివేకాన్ని నాశనం చేసింది. పాడుపాము విసిరిన మాయ వలలో చిక్కుకున్న ఆ కప్పరాజు, అక్కడే నివసించేందుకు పాముకు అనుమతిని ఇచ్చేసింది.

దాంతో మందవిషం కూడా దాన్ని తన పడగమీద ఎక్కించుకొని, కొంతసేపు చిత్ర విచిత్రంగా ఇక్కడా-అక్కడా త్రిప్పి, లేని బడలిక తెచ్చుకొని, రొప్పుకుంటూ, రోజుకుంటూ, తలను నేలవాల్చి కదలక-మెదలక ఉండిపోయింది. జలపాదం దాన్ని చూసి "నువ్వెందుకు, ఇట్లా నడవలేక పోతున్నావేమి?" అని అడిగింది.

మంద విషం మరింత నీరసం తటిస్తూ "స్వామీ! నిన్నటినుండి ఒక్క పిడిసెడు ఆహారం కూడా లభించకపోవటం వల్ల, శుష్క ఉపవాసంతో కడుపు మాడి, నా జవసత్వాలన్నీ ఉడిగిపోయినై; నేను బ్రతికి ఉండీ, శవం మాదిరి అశక్తుడినయ్యాను.



ఆకలితో నకనక-లాడుతున్న నా కడుపుకు ఇకనైనా కొంత ఆహారం ఇస్తే తప్ప, ఇక నేను వాహన కార్యం ఏ విధంగా చేయగలను,

చెప్పండి?! ఒకసారి కడుపునిండితే ఇక నేను ఎంత విచిత్రంగా అడుగులు వేస్తానో ప్రభువులవారే చూడవచ్చు!" అన్నది.

దాంతో కరిగిపోయిన జలపాదుడు ఆ మాటలు నిజం అనుకొని "ఓ పాము రాజా! నేను ఓ మాట చెబుతాను, విను. నువ్వు ఇట్లా మధ్య మధ్య నన్ను అడగాల్సిన పనిలేదు- 'బాగా ఆకలి అయినప్పుడల్లా నీకు కావలసినన్ని కప్పలను తినవచ్చు' -అని ఒకే సారిగా నీకు ఇదిగో, అనుమతిని ఇస్తున్నాను. ఇక ప్రతిరోజూ నీకు ఇష్టం వచ్చినన్ని కప్పలను తినవచ్చు. ఇప్పుడిక పో! పోయి, నీకు కావలసినంత ఆహారం తీసుకొని రా, వాహనపు పని మళ్లీ చేద్దువు" అన్నది రాజసంగా.

"మహాప్రసాదం" అన్న మందవిషం నీళ్లలోకి దూకి, చిన్న చిన్న కప్పల్ని కొన్నిటిని కరువు తీరా మ్రింగి, కడుపు నింపుకొని, చటుక్కున వచ్చి కప్పరాజు ఎదుట నిలబడింది. ఇలా ఇష్టం వచ్చినట్లు ప్రతిరోజూ కావలసినన్ని కప్పల్ని భోంచేసింది.

మొదట సన్న కప్పలను, తర్వాత ఇంకొంచెం బలవంతులను, తర్వాత మంత్రులను- ఇట్లా క్రమంగా చెరువంతా జలపాదం తప్ప వేరే ఏ కప్పలూ లేకుండా అయిపోయింది.

చిట్ట చివరికి, ఒంటరిదిగా మిగిలిన కప్పరాజుని సైతం దవడల్లో ఇరికించుకొని దాని మాంసం అంతా యిష్టంగా మెక్కింది మందవిషం.

ఆ తర్వాత "ఆహా! ఇప్పటికి కదా, నా వ్రతం పరిసమాప్తి అయ్యింది?!" అని సంతోషించి, అటుపైన ఆ కొలనును వదిలి వేరే చోటికి పోయింది ఆ పాము!

(...తర్వాత ఏమైందో మళ్ళీ చూద్దాం...)

నవ్వు!

"ఆపరేషన్ థియేటర్లో పూలదండ ఎందుకు పెట్టారండి?" అడిగాడు పేషెంట్ అమాయకంగా.

"ఆపరేషన్ సక్సెస్ అయితే డాక్టర్ మెడలో వేయడానికి, ఫెయిలయితే నీ మెడలో వేయడానికి!" చెప్పి నాలుక కరుచుకుంది నర్స్




# మూగవోయిన కోయిల

*రచన: నియతి శ్రీశేష అన్నమనేని, ఆరవ తరగతి, రిషివ్యాలీ స్కూలు, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

మదనపల్లిలో అర్జున్ అనే పిల్లవాడు ఉండేవాడు. వాళ్ళింట్లో అతను, వాళ్ళ అమ్మ ఇద్దరే ఉండేవాళ్ళు. వాళ్ళమ్మ అక్కడే ఓ కంపెనీలో అకౌంటెంటుగా పనిచేసేది.

అర్జున్‌కి సంగీతం అంటే చాలా ఇష్టం. ఎప్పుడూ ఇంట్లో పాటలు వింటూనే ఉండేవాడు. ఎక్కడికి పోయినా పాటలు పాడుతూనే ఉండేవాడు. బాగా చదివేవాడు కూడా. ఎప్పుడూ టీచర్లు అర్జున్‌ని పొగిడేవారు. తరగతిలో ఎప్పుడూ మొదటి స్థానంలో ఉండేవాడు. సంగీతం అంటే వాడికి ఉన్న అభిమానం చూసి, వాళ్లమ్మ వాడికి శాస్త్రీయ సంగీతం కూడా నేర్పించటం మొదలు పెట్టింది. అట్లా కొన్ని సంవత్సరాలు గడిచాక, సంగీతం పోటీల్లో కూడా పాల్గొని గెలిచాడు అర్జున్.

ఒక ఆదివారం నాడు వాళ్ల అమ్మవాళ్ళ చిన్ననాటి మిత్రులు కొందరు ఊరికి

వచ్చారని సమాచారం అందింది. తన మిత్రులని చూడటానికని మధ్యాహ్నం అనగా అమ్మ ఆటోలో వెళ్లింది. అర్జునేమో, పాటలు వింటూ ఇంట్లోనే కూర్చున్నాడు. ఒంటి గంట అయ్యింది; అమ్మ ఇంకా రాలేదు. "వాళ్ళ ఇంట్లోనే భోజనం చేసి సాయంత్రంగా వస్తుందేమో, మాట్లాడుకుంటున్నారేమో" అనుకున్నాడు అర్జున్. సాయంత్రం నాలుగు గంటలయింది. అమ్మ ఇంకా రాలేదు..

కానీ అరగంట తర్వాత ఎవరో ఒకాయన వాళ్ళ అమ్మని ఎత్తుకుని వచ్చాడు- తన ముఖం అంతా రక్తం. శరీరం అంతా కాలి ఉంది. వాళ్ల అమ్మని ఆ స్థితిలో చూసిన అర్జున్ కళ్ళు తిరిగి పడిపోయాడు!

అర్జున్ కళ్ళు తెరిచే సరికి వాళ్ళ ఇంట్లో లేడు: మంచం, పరుపు చూస్తే ఏదో హాస్పిటల్ లాగా ఉన్నది- అతను పైకి లేచి చుట్టూతా చూశాడు- గోడల మీద 'శ్రీనివాస్ హాస్పిటల్' అని రాసి ఉంది. ముందు "నేను ఇక్కడెందుకున్నాను? అమ్మ ఏది?" అని ఆలోచించాడు అర్జున్.

అకస్మాత్తుగా గుర్తుకువచ్చింది- "అమ్మ ఇక లేదు. చనిపోయింది!"

అర్జున్‌కి వెంటనే ఏడుపొచ్చింది. గట్టిగా ఏడవటం మొదలుపెట్టాడు. అది విని ఆసుపత్రిలో నర్సులు పరుగెత్తుకొని వచ్చారు. వాళ్ల అమ్మని ఎత్తుకొచ్చినాయన కూడా వాళ్ళ వెనకనే పరుగెత్తుకొని వచ్చాడు- "ఎలా ఉన్నావు నాన్నా? బానే ఉన్నావు కద?!" అని అడిగాడు.

"మా అమ్మ కావాలి!" అని ఏడ్చుకుంటూ చెప్పాడు అర్జున్.

"ఏం పరవాలేదులే బాబూ! ఏడవకు! నేను ఉన్నాను కదా! ఏడవద్దు. నా పేరు అరవిందరావు. ఇప్పట్నించి నేను నిన్ను జాగ్రత్తగా చూసుకుంటాను" అని ఊరడిం-చాడాయన.

పది రోజులు ఆసుపత్రిలో ఉన్న తర్వాత అర్జున్‌ని అరవిందరావుగారు తన ఇంటికి తీసుకెళ్ళారు. ఆ ఇల్లు బాగున్నది. చాలా పెద్దగా, విశాలంగా, అందంగా- కానీ అది అర్జున్ ఇంటిలాగా లేదు! అక్కడికి వెళ్ళాక అర్జున్ మనసులో విచారం మరింత ఎక్కువైంది.

ఆ రోజునించి ఇక అతని జీవితంలో అస్సలు పాటలు లేవు. ఎవరైనా ఏమైనా అడిగితేనే మాట్లాడేవాడు అర్జున్. లేకపోతే విచారంగా ఒకచోట కూర్చునేవాడు.



అరవిందరావుగారు అర్జున్‌ని చాలా ఆదరించేవారు; బాగా చూసుకునేవారు; తను ఉన్నప్పుడంతా పలకరించి మాట్లాడించేందుకు ప్రయత్నిస్తూ ఉండేవారు- కానీ "ఆయనతో నాకెందుకు? నాకు మా అమ్మ కావాలి!" అనిపించేది అర్జున్‌కి. ఎప్పుడు చూసినా వాళ్ల అమ్మ చిత్రం పట్టుకుని కూర్చుని ఉండేవాడు అతను. వేరే ఎవ్వరినీ తన తల్లి చిత్రాన్ని ముట్టుకోనిచ్చేవాడు కాదు.

అప్పుడప్పుడూ అరవిందరావుగారు ఓ గదిలోకెళ్ళి, తలుపులు వేసుకొని, తంబూర మీటుతూ సంగీతం పాటలు పాడేవారు. ఆయన గొంతు అద్భుతంగా, అందంగా, లోతుగా, గంభీరంగా ఉండేది. అయినా అర్జున్ తన నోరు విప్పలేదు. తనలోని సంగీతం ఏదో మూగబోయినట్లు అనిపించిందతనికి.

ఒకసారి అరవిందరావుగారు అడిగారు- "నీకు సంగీతం నేర్పించలేదా, అమ్మ?" అని.

"నేనే.. నేర్చుకోలేదు.." అనేశాడు అర్జున్.

"సంగీతం బలే ఉంటుంది- గొంతెత్తి పాడితే హృదయం తేలికౌతుంది!" అన్నారు అరవిందరావు గారు.

అర్జున్ ఏమీ మాట్లాడలేదు.

కొన్నాళ్ళు గడిచాక, అరవిందరావుగారు "అర్జున్, నువ్వెప్పుడైనా నీ కుటుంబ చిత్రాలు చూశావా?" అని అడిగారు.

"నేను, మా అమ్మ చాలా ఫొటోలు దిగాం" చెప్పాడు అర్జున్.

"అవి కాదు, నేననేది- మీ కుటుంబ చిత్రాలు-

మీ అమ్మమ్మ-తాతయ్యలవి; నానమ్మ-తాతయ్యలవి; మీ అమ్మ-నాన్నలవి; బంధువులవి- అవి చూశావా, ఎప్పుడైనా?" అడిగారు అరవిందరావుగారు.

"లేదు" అన్నాడు అర్జున్. "అట్లాంటివేమీ లేవు మా ఇంట్లో"

"నా దగ్గర ఉన్నాయి- చూపించనా?" అన్నారు అరవిందరావు గారు.

అర్జున్ ఏమీ మాట్లాడలేదు. తన కుటుంబ చిత్రాలు ఆయనకెక్కడివి?

అరవిందరావుగారు తమ కుటుంబ చిత్రాలు తెచ్చి అర్జున్ ముందు పెట్టారు. ఒక్కొక్కరి ఫొటో చూపిస్తూ "ఇదిగో, ఈయన మీ తాత. ఈమె మీ అమ్మమ్మ. ఈవిడ మీ నానమ్మ. ఈయన మీ నాన్న వాళ్ళ నాన్న. ఇదిగో, మీ అమ్మ చిన్నప్పటి ఫొటో చూడు- ..ఇది మా పెళ్ళి ఫొటో-"

అర్జున్ ఒక్క ఉదుటన లేచి చూశాడు- ఫొటోలో చిన్నప్పటి అమ్మ, చిన్ననాటి అరవిందరావుగారు- వాళ్ళిద్దరి పెళ్ళి ఫొటోనే అది!

"మీరు- " ఆగిపోయాడు అర్జున్.

"మీ నాన్నను." అన్నారు అరవింద-రావుగారు.

"మీరు మా నాన్న ఎందుకౌతారు?" అన్నాడు అర్జున్ ఆశ్చర్యంగా.

"నువ్వు పుట్టేముందు నేనూ, మీ అమ్మా దేని గురించో కొట్టుకున్నాము. కోపం వచ్చి విడిపోయాము. ఆ తర్వాత నేను మిమ్మల్ని కలవాలని చాలాసార్లు అనుకున్నాను. కానీ మీ అమ్మ కోపం తెలుసు గనక ధైర్యం చాలక, ఊరుకున్నాను. ఆ రోజున నేను ఆఫీసునుండి వస్తుంటే ఆటో బస్సును ఢీకొనటం చూశాను. ఆటోలో ఎవరున్నారని చూస్తే, మీ అమ్మ! తనని ఆసుపత్రికి తీసుకెళ్ళినా ప్రయోజనం లేకపోయింది. నేను నీకోసం వెతుక్కుంటూ వచ్చాను. నిన్నూ ఆసుపత్రిలో చేర్పించాల్సి వచ్చింది. నీకేమౌతుందోనని భయపడ్డాను- దేవుడి దయవల్ల నీకేమీ కాలేదు" చెప్పారు అరవింద రావుగారు.

అర్జున్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. వాడు చటుక్కున లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు- మధ్యాహ్నం అంతా

ఏడ్చుకుంటూ కూర్చున్నాడు.

ఆరోజు సాయంత్రం అరవింద రావుగారు సంగీతం సాధన చేస్తుంటే మెల్లగా గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు అర్జున్. కొద్దిసేపటి తర్వాత వాడు ఆయన గొంతుతో గొంతు కలిపాడు. అరవిందరావుగారు ఆశ్చర్యంగా చూశారు వాడి వంక. వాడి పాటని సున్నితంగా సరిదిద్దారు.

మూగవోయిన కోయిలకు మళ్ళీ పాట వచ్చింది... ఇక అర్జున్ మళ్ళీ ఎప్పటిలాగే మామూలు అర్జున్ అయిపోతాడు.

నవ్వులు!

పిచ్చమ్మ: భోజనం బాగోలేదంటూ అబ్బాయి ఉత్తరం రాశాడండి.

తిక్కన్న: అలాంటప్పుడు వేరే హోటల్‌కెళ్ళి తినొచ్చు కదా!

పిచ్చమ్మ: అలా తినడం జైల్లో కుదరదండి.

తండ్రి: నీకు పరీక్షలో వందకు తొంభై మార్కులు వస్తే ఐస్‌క్రీం కొనిపెడతా...

చింటు: అప్పటి వరకూ ఉంటే ఐస్‌క్రీం కరిగిపోతుంది.. ఇప్పుడే కొనివ్వండి నాన్నా!

పొరుగమ్మ: ఏంటొదినా, టీ గిన్నె కడక్కుండానే మళ్ళీ టీ చేస్తున్నావు? అట్లా చేస్తే టీ బాగుంటుందీ!?

ఇరుగమ్మ: నేను అసలు టీ తాగనమ్మా, ఇది నీ కోసమే కదా అని...

టీచర్: రెండో ప్రపంచ యుద్ధం వల్ల మనందరం చాలా నష్టపోయాం. ఇప్పుడిక మూడో ప్రపంచ యుద్ధం వస్తే ఏమౌతుందో ఊహించండి.

క్రాంతి (తన ప్రక్కనున్న పిల్లాడితో గుసగుసగా): టీచర్‌కి మతి పోయినట్లుందిరా! నిన్నేమో 'ప్రపంచం ఒక్కటే' అని చెప్పింది, ఇవాళ్ళేమో రెండో ప్రపంచం అంటోంది!

*సేకరణ: చదువుల క్రాంతి, శ్రీకాకుళం.*



# జీవితంలో స్నేహబంధం

*"నా ఉద్దేశంలో స్నేహానికి ఆస్తి అంతస్తు, చదువు ముఖ్యం కాదు. మంచితనం, స్నేహభావం ఉంటే చాలు" అని స్ఫూర్తినిచ్చే ఈ కథలో రాస్తున్నది శ్రీజ. నిజంగానే ఇది నిజం!*

*రచన: సి.హెచ్.దుర్గ శ్రీజ, పదవ తరగతి, తేజ విద్యాలయం, కోదాడ, నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.*

ధర్మారం బడిలో ఆరో తరగతి చదువుతున్నది వీణ. వీణది పేద కుటుంబం. తనకు చదువు విలువ తెలుసు. బాగా చదివేది.

అదే పాఠశాలలో గౌరి కూడా చదువుతున్నది. తనదీ వీణ వాళ్ళ తరగతే. గౌరిది ఉన్నత కుటుంబం. కానీ ఆమెకు డబ్బు ఉందని గర్వం ఏమీ లేదు. ఆమె మనసు చాలా మంచిది. ఒక్కటే సమస్య ఏమంటే తనకు చదువు బాగా రాదు! ఎప్పుడూ ఎవరో ఒకరు వచ్చి తనకు సహాయం చేస్తే బాగుండునని ఉండేది, ఆమెకు. ఎవరైనా సాయానికి వస్తే ఆమె నేర్చుకునేందుకు సిద్ధంగా ఉండేది- కానీ

ఎప్పుడూ ఎవ్వరూ రారు కద? అట్లా ఎవ్వరూ తనకు సాయం చేయనప్పుడు ఆమె సొంతగా ఏమాత్రం ప్రయత్నం చేసేది కాదు.

తరగతిలో పిల్లలు చాలామంది గౌరికి చదువు రాదని దూరం పెట్టేవాళ్లు. దాంతో గౌరి మరింత ముడుచుకు పోయి ఉండేది.

వాళ్ల పాఠశాలలో ఒక రోజున కథారచన పోటీ జరిగింది. అందులో పాల్గొందామని పేరు ఇచ్చింది వీణ. గౌరికేమో అసలు అక్షరాలు గుర్తు పట్టటమే రాదాయె. అందుకని ఆ పాప ఊరికనే కూర్చున్నది. "పుస్తకాలలో చదివిన కథలు రాయాలి" అని, పిల్లలందరూ తమకు నచ్చిన కథలు ఎంపిక చేసుకొని పెట్టుకున్నారు.

కాని వీణకి అది ఇష్టం కాలేదు. "నేను సొంతంగా కథ రాస్తాను" అనుకున్నది ఆ పాప. అయితే సొంతంగా కథలు రాయటం ఏమంత సులభం కాదుగదా, తరువాతి రోజు ఉదయాన్న బడికి వచ్చేసరికి ఏం రాయాలో అసలు గుర్తుకే రాలేదు వీణకి! అలాంటి సమయంలో తనకి ఎదురైంది గౌరి.

"నువ్వు ఏం కథ రాస్తున్నావు గౌరీ?" అని అడిగింది వీణ.

గౌరి విచారంగా నవ్వింది- "నాకు రాయటమే రాదు కదా?!" అన్నది.

"మరి నీకు తెలిసిన మంచి కథ ఏదైనా ఉంటే చెప్పరాదూ? నాకు ఏమీ ఐడియాలు రావట్లేదు" అన్నది వీణ.

"లేదు వీణా, కథ అంటే సొంతంగానే రాయాలి. దానికే విలువ ఎక్కువ. జాగ్రత్తగా దేన్ని గురించి ఆలోచించినా కథలు తయారవుతాయి. పోనీ, నీకు నచ్చిన స్నేహితురాలి కథ ఒకటి ఊహించి రాయి! నేనంటే ఏమీ రాయలేను, అక్షరాలు రాక- నీకేమి, నువ్వు ఏదనుకుంటే అది రాయగలవు!" అన్నది గౌరి.

ఆ మాటలు వినగానే వీణ మనసులో అప్పటికప్పుడు ఒక కథ తయారైంది! ఆమె వెంటనే గౌరిని దగ్గరికి తీసుకొని- "నాకు కథా రచనలో మొదటిస్థానం వచ్చినా- రాకపోయినా పర్లేదు గాని, నీతో మాట్లాడాక 'స్నేహితురాలంటే నీలాగే ఉండాలి' అని తెలుసుకున్నాను. మళ్ళీ కలుస్తా-" అని చెప్పి

కథా రచనకు పరుగు పెట్టింది.

ఆనాటి కథా రచనలో మొదటి బహుమతి వీణదే! తను రాసిన కథని పట్టుకొచ్చి గౌరికి చూపించింది వీణ- "ఇదిగో గౌరీ! నీకు అన్ని సంగతులు తెలుసు కదా, అక్షరాలు ఎందుకు రావు? నేను నీకు తెలుగు రాయడం, చదవటం అన్నీ నేర్పిస్తాను సరేనా?" అన్నది.



"నేను ఎందరినో అడిగాను. నాకు ఎవ్వరూ సహాయం చేయలేదు. నువ్వు నేర్పిస్తే తప్పకుండా నేర్చుకుంటాను" అన్నది గౌరి.

"నేను నేర్పిస్తానులే; కానీ నువ్వట్లా ఎవరో వస్తారనీ ఏదో నేర్పిస్తారనీ ఎదురు చూస్తూ కూర్చోకూడదు- సొంతంగా ప్రయత్నించాలి. సరేనా?" అని వెంటనే చదువు మొదలు పెట్టింది వీణ. త్వరలోనే గౌరికీ చదవటం, రాయటం వచ్చేసింది.

పది సంవత్సరాల తరువాత ఏం జరిగిందో ఊహించగలరా?!

"వీణ మంచి ఉద్యోగం చేస్తోంది; గౌరికి పెళ్లయిపోయి ఇంట్లో కూర్చుంది" అనుకుంటున్నారా? లేదు!

వీణ గొప్ప రచయిత అయింది; గౌరి ఓ మంచి ఉద్యోగం చేస్తున్నది!

వాళ్ల జీవితాలు మారడానికి ఓ అందమైన స్నేహమే కారణం!!

**మరిన్ని సొంత కథలు రాయండి!**

మీరు పిల్లలా?! ఎక్కడా చూసి కాపీ కొట్టకుండా పూర్తిగా సొంతంగా ఏదైనా చక్కని కథ రాశారా? దాన్ని కొత్తపల్లికి పంపించండి. కథతోబాటు మీరు చదివే తరగతి, బడిపేరు, మీ చిరునామా, వీలైతే మీ పాస్‌పోర్టు సైజు ఫొటో కూడా పంపండి. మీ కథ ప్రచురింపబడితే మీకు ఒక కొత్తపల్లి పుస్తకం ఎలాగూ పంపిస్తాం. దాంతోబాటు, తాతగారు (కృష్ణమూర్తిగారు, విశ్రాంత సంచాలకులు- వ్యవసాయ శాఖ) మిమ్మల్ని మెచ్చుకుంటూ పంపే 100రూ.ల బహుమతినీ అందుకోండి!



# అడవి తల్లి



*రచన: జయదుర్గ, మిర్యాల గూడ.*

ఒక ఊళ్లో శివయ్య అనే యువకుడు ఉండేవాడు. వాళ్లది చాలా పేద కుటుంబం. శివయ్య చిన్నప్పటి నుండి కూలి పనులు చేసుకుంటూ డిగ్రీ వరకు చదువుకున్నాడు. అతను డిగ్రీ చదివేటప్పుడే వాళ్ల నాన్న చనిపోయాడు. వాళ్ల నాన్న చనిపోయిన తరువాత శివయ్య చదువు ఆపేసి, ఉద్యోగం కోసం వెతకసాగాడు. కానీ ఎంత ప్రయత్నించినా ఉద్యోగం దొరకలేదు. చివరికి వాళ్లకి తిండి దొరకడానికి కూడా కష్టమైంది. ఇక చేసేదేమీ లేక కట్టెలు కొట్టి, వాటిని అమ్మి జీవనం సాగిద్దామని అనుకున్నాడు. అతనికి తెలుసు- చెట్లు నరకడం వల్ల వర్షాలు రావని. అయినా తప్పేటట్లు లేదు మరి!

అయిష్టంగానే మరుసటి రోజు కట్టెల

కొట్టడానికి అడవికి వెళ్లాడు. అడవిలో కట్టెలు కొడుతూ ఉండగా శివయ్యకు బాగా ఆకలి వేసింది. "అడవిలో ఏం దొరుకుతాయి?" అని కొద్ది సేపు ఊరుకున్నాడు. అయినా ఆకలి వేస్తూనే ఉంది. 'తినేందుకు ఏమైనా కావల్సిందే' అని అడవిలో అంతా వెతుక్కుంటూ తిరిగాడు. అది ఏప్రియల్ నెల- చెట్లన్నీ పచ్చగా ఉన్నాయి. అన్నిటికీ పూలు, అక్కడక్కడా పళ్ళు ఉన్నాయి. శివయ్యకు ఏవి తినచ్చో, ఏవి తినకూడదో అంత బాగా తెలీదు- అయినా తన అనుమానం కొద్దీ నచ్చిన పళ్ళు కోసుకొని తిని చూశాడు. వాటిలో కొన్ని అద్భుతంగా ఉన్నాయి!

వాటిని తింటూ ఉండగా అతనికి ఒక ఆలోచన వచ్చింది: "నేను ఈ పళ్లు అమ్మి ఎందుకు జీవనం సాగించకూడదు? చెట్లను కొట్టకుండా ఉండొచ్చు కదా!" అనుకున్నాడు. వెంటనే తనకు నచ్చిన కాయలు, పళ్ళు కొన్ని కోసుకొని, పక్కఊరికి వెళ్లి అమ్ముకొని వచ్చాడు.

అప్పటికే అక్కడ వాళ్ల అమ్మ శివయ్య కోసం ఎదురుచూస్తూ ఉన్నది. 'కట్టెలు ఏవిరా?' అని అడిగితే జరిగినదంతా చెప్పి, తను సంపాదించిన డబ్బుల్ని ఆమె చేతిలో పెట్టాడు శివయ్య. "ఒరే, అడవిలో ఏ కాయలు మంచివో, ఏవి కావో తెలుసుకోవాలి. ఎవరినైనా అడిగి ఏవి దేనికి పనికొస్తాయో కూడా కనుక్కోవాలి" అని, వాళ్ల అమ్మ వెళ్ళి ఊళ్ళో వాళ్ళను అడిగి ఆ సమాచారం కూడా తెచ్చి పెట్టింది.



ఆ తర్వాత శివయ్య, వాళ్ళ అమ్మ ఇద్దరూ పిల్లలు ఇష్టంగా తినే రేగిపళ్ళు, జానిపళ్ళు, నేరేడు కాయలు, బలిజపళ్ళు, కలివి కాయలు, వీటితోబాటు పెద్దవాళ్లకు ఉపయోగపడే కుంకుడు కాయలు, ఉసిరి కాయలు, తేనె- ఇలా రకరకాల వస్తువులను

అడవిలోంచి తెచ్చి ఊళ్ళలో అమ్మటం మొదలు పెట్టారు.

ఆ సంవత్సరం వానలు సరిగా లేక, ఊరిలో కూడా పనులు ఏవీ లేక, ఊళ్ళోవాళ్ళు చాలామంది పట్నాలకు వలస పోతామని బయలుదేరారు.



కానీ శివయ్య "అడవి తల్లి ఉండగా మనకు అంత అవసరం ఏమొచ్చింది?" అని ఊళ్ళో యువకులకు మరికొంతమందికి తను చేస్తున్న పనినే నేర్పాడు. తను బ్రతకటమే కాకుండా మరికొంత మందికి బ్రతుకు తెరువు కల్పించాడు.

అయితే త్వరలోనే అడవిలోనే పళ్ళు, కాయలు దొరకటం కష్టమై పోయింది.

ఊళ్ళో వాళ్లంతా సమావేశమయ్యారు. "అడవిని నమ్ముకుంటే బాగుంది. కానీ ఇలాంటి సమస్యలు వస్తే ఏం చెయ్యాలి? అందుకని మనం మన పొలాల్లోనే పంటలతో పాటు పూల చెట్లు, కూరగాయలు, పళ్లు పండిద్దాం. నీళ్ళ పొదుపు కోసం బిందు సేద్యం చేద్దాం. ప్రస్తుతానికి పూలు త్వరగా పూస్తాయి కాబట్టి ముందు పూలచెట్లు పెట్టుకుందాం, తరువాత మిగిలిన పంటలు చేతికి వస్తే వాటిని అమ్మి జీవనం సాగిద్దాం" అన్నాడు శివయ్య.

ఇంత మంచి సలహా ఇచ్చినందుకు గ్రామస్తులంతా శివయ్యని అభినందించారు. అందరికీ లాభదాయకమైన ఈ పథకం ఫలించింది. ఆ సంవత్సరం ఊళ్ళో ఎవ్వరూ వలస పోలేదు!

కొట్టకుండా, తిట్టకుండా విద్య నేర్పే ఉపాధ్యాయుడే నిజమైన గురువు.



# అమ్మా కథ చెప్పవా?

రచన: ఎం ప్రణీత, పదవ తరగతి, తేజ విద్యాలయం, కోదాడ, నల్గొండ జిల్లా, తెలంగాణ.

"అనగనగా ఒక చెట్టు. ఆ చెట్టు కింద ఒక పుట్ట" అని అన్నది అమ్మ ఎప్పటిలాగానే, తన పాపకోసం కథ మొదలు పెడుతూ.

"అమ్మా ఎప్పుడూ అదేనా, వేరే కథ చెప్పు" అడిగింది పాప.

"అన్ని కథలూ ఒకేలాగా మొదలవుతాయి పాపా, రాను రాను మారిపోతై. ఈ కథ నీకు తెలీని కొత్త కథే" అంది అమ్మ.

"ఊఁ సరే, అయితే, చెప్పు" అంది పాప.

అమ్మ కొనసాగించింది- "నీకు తెలుసు కదా, అడవిలో ఒక పెద్ద నది ఉంది. ఆ నది ఒడ్డున పెద్ద అడవి ఉంది. ఆ అడవిలో ఉంది, నేను చెప్పిన చెట్టు. ఆ చెట్టుమీద ఒక కాకి తన పిల్లలతో కలిసి జీవిస్తున్నది. ఒకసారి ఏమైందంటే, పిల్లలకు ఆహారం తీసుకురావడానికి వెళ్లింది తల్లి. కాకి పిల్లలు మరి చాలా ఆకతాయిలు కదా, అందుకని అవన్నీ తల్లికాకి లేని సమయం చూసుకొని తలలు కిందికి వంచి నదిలోకి చూస్తూ గొడవ

పడటం మొదలు పెట్టాయి.

కొంచెం సేపటికి వెనక్కి తిరిగివచ్చిన తల్లి కాకికి, తలక్రిందులుగా ఉన్న పిల్లలు కనబడ్డాయి. దానికి చాలా భయం వేసింది. అదన్నది-

"పిల్లలూ! అట్లా తొంగి చూడకండమ్మా. కాలు జారి కింద పడవచ్చు, నీళ్లలో కొట్టుకు పోవచ్చు, శత్రువులు ఎవరైనా మనమీది దాడి చేయచ్చు- ప్రమాదం జరిగాక ఇంక ఏమీ చెయ్యలేం కదా, అందుకని ముందునుండే జాగ్రత్తగా ఉండాలి" అని.

పిల్లలు తల్లి మాటలను విన్నారు- ఆ క్షణం వరకే ! తరువాత వాళ్ల పని వాళ్లది!

మర్నాటి రోజున తల్లి ఆహారానికి వెళ్లగానే మళ్లీ క్రిందికి తొంగిచూడడం మొదలు పెట్టాయి. ఈ సారి తల్లి పిల్లలను ఇంకొంచెం గట్టిగా మందలించింది. "చెప్పేది మీ మంచికే కదా! ఆ మాత్రం అర్థం చేసుకోకపోతే ఎలాగ?" అన్నది.

అయినా పట్టించుకోలేదు కాకి పిల్లలు.

తరువాతి రోజు ఏమైందో తెలుసా? తల్లి అటు ఆహారానికి వెళ్ళగానే పిల్లలన్నీ లేచి తలక్రిందులుగా వ్రేలాడుతూ ఒక దానిని ఒకటి నెట్టుకోవటం మొదలు పెట్టాయి. అంతలోనే ఒక కాకి పిల్ల పట్టు తప్పింది. తటాలున నదిలో పడింది; మిగతావి ఇంకా చూస్తూండగానే నదిలో కొట్టుకుని పోయింది!

మిగిలిన పిల్లలన్నీ భయంతో కెవ్వుమని అరిచాయి- హాహాకారాలు చేశాయి"

అమ్మ కథ ఆపింది- పాప కళ్ళలో నీళ్ళు- "కాకి పిల్ల ఇంక రాలేదా, పాపం?!" అన్నది.

"ఇంకా కథ ఐపోలేదు పాపా" చెప్పింది అమ్మ- "సరిగ్గా ఆ సమయానికి తల్లి కాకి నదిపైనుండి ఎగురుకుంటూ వస్తున్నది. పిల్లల అరుపులు వినగానే దానికి సంగతి అర్థమైంది. క్రిందికి చూసేసరికి మునుగుతూ, తేలుతూ కొట్టుకుపోతున్న పిల్ల కనిపించింది. అది ఒక్కసారిగా నీళ్లలోకి దూకి, కొట్టుకుపోతున్న పిల్లను ముక్కున కరచుకొని గూటికి ఎగిరి వచ్చింది.

పిల్ల నీళ్ళు మ్రింగి, కొన ప్రాణంతో కొట్టుకుంటున్నది పాపం! అప్పుడు తల్లి, మిగిలిన పిల్లలు అన్నీ కలిసి, ఆ కాకి పిల్లని

ఒత్తి, తుడిచి, రెక్కలతో విసిరి సేవలు చేశాయి. కొంత సేపటికి పిల్ల కళ్ళు తెరిచింది. వాళ్ళ అమ్మని, తోటి పిల్లల్ని గుర్తు పట్టింది.



అప్పుడు తల్లికాకి అన్నది- "నేను ముందే చెప్పానా, ప్రమాదం అని?! మీరు నా మాట వినలేదు. చూశారా, ఎంత కష్టం వచ్చిందో? సమయానికి నేను అక్కడే ఉన్నాను కాబట్టి పాపకి ఏమీ కాలేదు. లేకపోతే ఎంత నష్టం జరిగేది?! అందుకనే, ఎప్పుడైనా సరే పెద్దలమాట విని బుద్ధిగా ఉండాలి అనేది!" అని. ఇక అప్పటినుండి పిల్లలన్నీ చాలా జాగ్రత్తగా ఉన్నై" అని ముగించింది అమ్మ.

ఆ రోజున నాన్న పనులు ముగించుకొని ఇంటికి వచ్చాక, వాళ్ల నాన్నకి ఇదే కథ చెప్పింది, పాప.

నాన్నకి చాలా ఆశ్చర్యం వేసింది. "బలే కథ చెప్పావు పాపా! అమ్మకి చూశావా, పిల్లలంటే ఎంత ప్రేమో?!"అన్నారు.

"లోకంలో తల్లి ప్రేమ చాలా మధురమైనది  
అది అందరికీ దొరకని ఒక వజ్రం  
వెలకట్టలేని ఒక నాణెం  
చేయలేని ఒక యుద్ధం  
స్వరంలేని రాగం  
మరువలేని ఒక జ్ఞాపకం" అని తను రాసిన ఓ కవిత వినిపించారు.

"అందరి అమ్మలూ అంత గొప్పగా ఉండరులేండి!" అన్నది అమ్మ-

"అమ్మ ఉండటం ఒక వరం  
ఆమె లేకుంటే అదే ఒక శాపం!  
బ్రతకాలి అని అనిపిస్తుంది అమ్మ ఉంటే  
ఎందుకు బ్రతకాలి అనిపిస్తుంది అమ్మ లేకుంటే" అని తనూ ఓ కవిత చెప్పేసింది.

పాప నవ్వింది. "నువ్వు చెప్పిన మాట వింటానులే అమ్మా, ఎప్పుడూ గొడవ చేయను!" అని వాళ్ల అమ్మకు మాట ఇచ్చి హాయిగా నిద్రపోయింది.

# అడవిలో ఆసుపత్రి

రచన: రిషీవ్యాలీ స్కూల్ పిల్లలు



అనగనగా ఒక అడవి ఉండేది. ఆ అడవిలోని జంతువులన్నింటికీ, పాపం ఏదో ఒక సమయంలో గాయాలు తగులుతూనే ఉన్నాయి. గాయాలు తగిలినప్పుడు వాటిని ఎలా మాన్పుకోవాలో ఆ జంతువులకి తెలీదు! రాను రాను ఈ సమస్య బాగా పెద్దదైంది. పట్టించుకోకపోతే ఇంక వీలయ్యేట్లు లేదు. అందుకని, అడవిలోని జంతువులన్నీ ఒకసారి సమావేశమయ్యాయి. సింహం ఈ సమావేశానికి పెద్ద .



అది ముందుగా లేచి, "మనం అందరం ప్రతిరోజూ ఏవో కొన్ని గాయాల బారిన పడుతున్నాము. గాయాలు తగిలినప్పుడు వాటిని ఎలా మాన్పుకోవాలో మనలో చాలామందికి తెలీటం లేదు. సమస్య బాగా పెద్దది. మనమంతా కలిసి, ఐకమత్యంతోటే దీన్ని సాధించగలం. మీలో ఎవరైనా దీనికి పరిష్కారం సూచించగలరా?" అన్నది.

అప్పుడు నక్క లేచి "మనమందరం ఏకం అవుదాం. మనకు హాని కలిగించేవాళ్ళనందరినీ

చంపేద్దాం" అన్నది.

సింహం దాని మాటల్ని కొట్టి పడేస్తూ "ఇది వీలు కాదు- మనకు హాని కల్గించే దెబ్బల్ని మనం ఎలా చంపగలం?" అన్నది నవ్వుతూ. "వేరే ఎవరైనా దీనికి పరిష్కారం చెప్పగలరా?" అని మిగిలిన వాళ్ళ కేసి చూసింది.



అప్పుడు పులి లేచి "మనం గాయాల బారిన పడుతున్నది చాలా వరకు మనుషుల వల్లే, కాబట్టి వాళ్ళు మన అడవిలోకి రాకుండా అడ్డుకుంటే సరి" అన్నది.

"ఇది కొంచెం బానే ఉంది. ఐతే మనుషులను ఆపటం ఏమంత సులభమైన పని కాదు. ప్రస్తుతానికి సభను ఇంతటితో ముగిద్దాం. రేపు ఉదయం తొమ్మిది గంటలకల్లా సభ మళ్ళీ మొదలవుతుంది. ఆలోగా మీరు బాగా ఆలోచించి ఏదైనా మార్గం సూచించండి" అన్నది సింహం.



మర్నాడు జంతువులన్నీ ఏవేవో ఆలోచనలు చెప్పాయి గానీ, సింహ రాజుకు అవేవీ నచ్చలేదు.

ఇంతలో కుందేలు లేచి నిలబడి, "మహారాజా! గాయాలు,దెబ్బలు రకరకాల కారణాల వల్ల ఎదురవ్వవచ్చు- కేవలం మనుషుల వల్లనే కాదు. అందరూ కొంచెం ఆలోచించండి-

మానవులకు దెబ్బ తగిలితే వాళ్ళు ఆ దెబ్బ తగిలించిన వస్తువుల్ని ఏమీ అనరు- దగ్గర్లో ఉన్న ఆసుపత్రికి వెళతారు! అందుకని, మనం కూడా మన సమస్యను దూరం చేసుకోవాలంటే వాళ్లలాగే ఒక ఆసుపత్రిని నిర్మించుకోవాలి. వేరే మార్గాలేవీ పని చెయ్యవు" అన్నది.



జంతువులన్నీ "అవునవును" అన్నాయి. ఇంత అద్భుతమైన ఐడియా ఇచ్చినందుకు కుందేలును అభినందించాయి.

అన్నీ జంతువులు కలిసి శ్రమించి ఒక ఆసుపత్రిని నిర్మించుకున్నాయి. ఆ తరువాతగానీ వాటికి అనుమానం రాలేదు- "అవునూ, మనం ఇంత కష్టపడి ఆసుపత్రి కట్టాం కదా, మరి మనకు డాక్టరు గారు ఏరి?" అని.




"ఇంకెవరు, ఈ ఐడియా ఇచ్చిన కుందేలే మనకు డాక్టరు" అన్నది సింహం.

అప్పటికే రకరకాల మందు మొక్కల గురించి చదివి పెట్టుకున్న కుందేలు "సరే, దానిదేముంది?" అన్నది.

అప్పటి నుండి అడవిలోని జంతువులన్నీ దెబ్బ తగిలితే చాలు- కుందేలు డాక్టరుగారి దగ్గరికి పరుగు పెట్టసాగాయి!



# ఉడత సాయం

*రచన: సి.హెచ్.మయూర్, 4C,మహీంద్ర అకాడమీ, జహీరాబాద్, తెలంగాణ రాష్ట్రం.*
*సౌజన్యం : మన లైబ్రరీ, జహీరాబాదు*

ఒక రోజున ఓ ఉడత ఎక్కడినుండో వచ్చి ఇంట్లోకి దూరింది. అది ఒక ముసలాయన ఇల్లు. ఉడత ఇంట్లో లోపలి గదిలోకి పరుగెత్తి, ఒక మూలన వణికిపోతూ కూర్చున్నది. ఆ సమయానికి ముసలాయన ఇంట్లో లేడు. ఆయన తిరిగి వచ్చేసరికి గదిలోంచి ఏవో శబ్దాలు వినిపిస్తున్నాయి. చూస్తే ఉడత! వంటగదిలో, గిన్నెల మాటున, వణికిపోతూ కూర్చొని ఉన్నది!

ముసలాయనకు దాన్ని చూస్తే ముచ్చట వేసింది. దాని భయం చూసి జాలి వేసింది కూడా. మెల్లగా చేతులు చాపి, దాన్ని పట్టుకొని, ఎత్తుగా ఉన్న పెట్టె మీద కూర్చోబెట్టాడు. తను చేసుకున్న టొమాటో

సూప్‌ని ఒక చిన్న ప్లేట్లో వేసి దాని ముందుంచాడు.

ఉడత కొంచెం సేపు కదలలేదు. భయం భయంగా అట్లాగే కూర్చున్నది. ఆ తర్వాత మెల్లగా అడుగు ముందరికి వేసి సూప్‌ని నాకటం మెదలుపెట్టింది. కొంత సేపటికి అంతా తాగేసింది.

ఆ తర్వాత దాని భయం మాయమ్మైంది. ముసలాయన ఏమీ చెయ్యడని అర్థమ్మైంది. ఇంట్లో అంతటా తిరిగింది, ఇంటి బయటికెళ్ళి చూసింది. సంతోషంగా ఎగురుకుంటూ ఆడింది.

దాని ఆటలు, గంతులు ముసలాయనకు ఎంతో తమాషాగా అనిపించాయి. ఆయన తన దగ్గరున్న బెల్లం ముక్కలు, పల్లీలు- కొన్ని కొన్ని తెచ్చి పెట్టాడు దానికి. దానికి అవన్నీ నచ్చాయి. ఆ రోజంతా అక్కడే, ముసలాయన చుట్టూ తిరుగుతూ ఉన్నదది.

ఆ రోజు రాత్రి, ముసలాయన పడుకున్నాక, గమనించింది ఉడత- ఎలుక ఒకటి, బయట నుంచి ఇంటికి కన్నం చేస్తున్నది. ముసలాయన ఇంకా అది చూసుకున్నట్లు లేదు..

తర్వాతి రోజున ఆయన పనిచేసుకొని వచ్చేలోగా ఉడత కిటికీలోంచి లోపలికి బయటికి తిరుగుతూ కొద్దికొద్దిగా మట్టిపట్టుకు వచ్చి, ఆ కన్నాన్ని కప్పేసింది.

అది చేసిన పనిని చూసి ముసలాయన ఎంతో సంతోషించాడు. "అంత చిన్న ప్రాణి.. అయినా దానికి ఎంత కృతజ్ఞత ఉందో కదా!" అనుకున్నాడు. కన్నాన్ని సిమెంటుతో మూసేసాడు.

అప్పటినుండీ ఆ ఉడతను మరింత శ్రద్ధగా చూసుకున్నాడు.

నవ్వు

**అన్నీ ఒకటే రేటు!**

కస్టమర్: ఏది కొన్నా వంద రూపాయలేనా?

యజమాని: అవును అన్నీ ఒకటే ధర...

కస్టమర్: అయితే ఈ వంద తీసుకొని మీ ముందున్న గల్లా పెట్టె ఇవ్వండి!



# స్నేహం

*రచన: P. రూపేష్, 6 వ తరగతి, M. పద్మజ, 8 వ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్.*

రామాపురంలో చంద్రమ్మ, సోమయ్య అనే భార్యాభర్తలు ఉండేవాళ్ళు. ఏ రోజుకారోజు పనికి పోతే గానీ ఇల్లు గడవని పరిస్థితి వాళ్ళది. ఇద్దరూ కూలి పనులు చేసుకునేవాళ్ళు. వాళ్ళకు ఒక్కడే కొడుకు- పేరు రామారావు.

మొదట్లో భార్యాభర్తలిద్దరూ వాడిని బడికి పంపించలేదు. "పేదోళ్లకు చదువు-లెందుకు?" అనేశాడు సోమయ్య. అయితే రామారావుకు మాత్రం బడికి వెళ్ళాలని ఉండేది. ఆ ఊర్లో పనిచేసే ఉపాధ్యాయుడు కూడా "మీవాడు తెలివైనవాడమ్మా, బడికి పంపండి- బాగు పడతాడు" అని కనబడ్డప్పుడల్లా చెప్పాడు. దాంతో "సరేలే, పది వరకు చదివిద్దాం" అని, వాడిని బడికి పంపసాగారు భార్యాభర్తలు.

రామారావుకు తల్లిదండ్రుల కష్టం తెలుసు. అందుకని వాడు ప్రతి ఆదివారమూ పోయి

ఇంటికి అవసరమైన కట్టెలు కొట్టుకొచ్చేవాడు; తన బట్టలు తనే ఉతుక్కునేవాడు; ఇంటి పనులు చేసి పెట్టేవాడు; సెలవల్లో పొలం పనులు చేసేవాడు; బళ్ళో కూడా మనసు పెట్టి బాగా చదివేవాడు; అందరి చేతా 'మంచి పిల్లవాడు' అనిపించుకున్నాడు.

పదో తరగతి పరీక్షల్లో వాడికి మంచి మార్కులు వచ్చాయి. పట్నంలో ఉన్న కాలేజీ వాళ్ళు "మీ వాడికి ఫ్రీ సీటు ఇస్తాం- హాస్టల్ ఫీజులు మాఫీ చేస్తాం" అని కబురు పెట్టారు- దాంతో "ఇంకో రెండేళ్ళు చదవనిద్దాంలే-పోనీ" అని కాలేజీలో చేర్చారు తల్లిదండ్రులు.

ఆ సరికి రామారావుకి చదువంటే చాలా ఇష్టం ఏర్పడింది. కానీ వాడికి తెలుసు- వాడిని ఆమాత్రం చదువులు చదివించే స్థోమత కూడా వాడి తల్లితండ్రులకు లేదు. అందుకని వాడు కాలేజీ అయిపోగానే పట్నంలోని దుకాణాల్లో లెక్కలు రాసే పని పెట్టుకున్నాడు. తల్లిదండ్రుల మీద ఆధారపడకుండా ఏదైనా పని చేసి చదువుకోవాలని, సెలవల్లో పనికి పోయేవాడు. అలా వచ్చిన డబ్బుల్లో కొంత చదువుకు వాడుకొని, మిగతాది ఇంట్లో ఇచ్చేసేవాడు- ఎప్పుడూ ఒక్క నిమిషం కూడా ఖాళీగా ఉండేవాడు కాదు.



కాలేజీలో చేరిన మొదటి రోజునే 'రూపేష్' అనేవాడు పరిచయం అయ్యాడు రామారావుకి. రూపేష్ ధనవంతుల కొడుకు. వాడి చేతిలో ఎప్పుడూ డబ్బులు ఆడుతూ ఉండేవి- ఏవేవో కొనుక్కొని తింటూ ఉండేవాడు; అందరి మీదా విసుక్కునేవాడు; ఎవ్వరితోనూ సరిగా మాట్లాడేవాడు కాదు. అయినా వాడికి

ఎందుకనో రామారావు నచ్చాడు- వచ్చి వాడి ప్రక్కనే కూర్చునేవాడు.

కాలేజీలో క్లాసులు మొదలయ్యాయి. రామారావు రోజూ క్రమం తప్పకుండా క్లాస్‌కి వెళ్ళేవాడు. ఎప్పుడు చెప్పిన పాఠాలు అప్పుడు చదివేసేవాడు. ఎంత చిన్న హోంవర్కు ఉన్నా మర్చిపోకుండా చేసేసుకునేవాడు. కాని రూపేష్ మాత్రం క్లాసులకు వెళ్లకుండా బయట తిరిగేవాడు. మళ్ళీ "నీ నోట్సు ఇవ్వురా, రాసుకొని మళ్ళీ ఇచ్చేస్తాను" అనేవాడు.



కొన్నాళ్ళు ఇదంతా గమనించిన రామారావు రూపేష్‌తో "ఒరే! నువ్వు ఇలా బయట తిరగొద్దురా, ఇద్దరం కలిసి బాగా చదువుకుందాం! అర్థం చేసుకో ప్లీజ్" అని రకరకాలుగా చెప్పాడు. కాని రామారావు వినలేదు- "నీ పని నువ్వు చూసుకో- నేను అడిగినప్పుడు నీ నోట్సు ఇవ్వు అంతే. నీతులు బోధించకు" అని అరిచేవాడు.

"ఇంక చేసేదేమున్నది?" అని రామారావు పోయి తన పని తను చూసుకునేవాడు.

కొంతకాలం తర్వాత మొదటి యూనిట్ టెస్ట్ పరీక్షలు మొదలయ్యాయి. రామారావుకు అన్ని అంశాలలోనూ మంచి మార్కులు వచ్చాయి; ఇక రూపేష్ ప్రతి ఒక్క సబ్జెక్టులోనూ ఫెయిల్ అయ్యాడు!

రూపేష్ వాళ్ల ఇంట్లో ఈ సంగతంతా తెలిసింది. వాళ్ళు వాడిని మందలించారు. రామారావుని ఇంటికి రమ్మని, "మా వాడిని కొంచెం గమనించుకో నాయనా!" అని చెప్పారు. "కాలేజీ అయిపోగానే మా ఇంటికొచ్చి కూర్చొని చదువుకోరాదూ, ఇద్దరూ?" అన్నారు.

"అది కష్టమండి- నేను దుకాణంలో పనికి పోవాలి" అన్నాడు రామారావు. అట్లా వాళ్ల

ఇంట్లో వాళ్లతో పాటు రూపేష్‌కి కూడా రామారావు వాళ్ళ ఇంటి పరిస్థితి తెలిసింది.

కొంచెం సేపు ఆగి, తర్వాత- "అయితే ఒక పని చెయ్యి- మాకూ దుకాణం ఉన్నది కద, కాలేజీ అయిపోగానే ఇద్దరూ ఇక్కడికి రండి- కొద్ది సేపు చదువుకున్నాక, ఇద్దరూ మా దుకాణంలోనే పని చేయచ్చు. ఇకనుండి మా వాడికి 'పాకెట్ మనీ' అని లెక్కలేనన్ని డబ్బులు ఇవ్వం. నీకు ఇచ్చినట్లుగానే మావాడికి కూడా ఇప్పటినుండి నెల జీతం ఇస్తాం- దాంతో వాడు ఏం కావాలంటే అది చేసుకుంటాడు. ఏ సంగతీ చెప్పండి మరి-" అన్నారు రూపేష్ వాళ్ల అమ్మానాన్నలు.

రామారావు రూపేష్ వైపు చూశాడు. "అంత పేదరికంలో ఉండి కూడా రామారావు ఎంత శ్రద్ధగా చదువుతున్నాడు- మరి నేను?!" అని విచారిస్తున్న రూపేష్ అప్పటికప్పుడు "సరే, అట్లాగే కానీయండి- ఇద్దరం కలిసి చదువుతాం, కలిసి పనిచేస్తాం!" అన్నాడు.

ఇక ఆనాటినుండి రూపేష్, రామారావు ఇద్దరూ మంచి స్నేహితులు అయిపోయారు. ఇద్దరూ ఒక్క క్లాసూ మిస్ కాకుండా వెళ్లారు. ఎప్పటి పని అప్పుడు పూర్తి చేసుకున్నారు. రోజూ సాయంత్రం పూట దుకాణంలో పని చేశారు. వాళ్లు కలసి మెలసి ఉండటమే కాకుండా ఇతరులకు కూడా సహాయపడుతూ మంచి పేరు తెచ్చుకున్నారు. సంవత్సర పరీక్షల్లో ఇద్దరూ మంచి మార్కులతో ఉత్తీర్ణత సాధించారు. అంతేకాదు; ఆ సంవత్సరం వాళ్ల కాలేజీలో 'బెస్ట్ స్టూడెంట్ అవార్డు'కు ఎంపికయ్యారు ఇద్దరూ!




సాధారణంగా ఈ అవార్డును ఒక్కరికే ఇస్తారు. అలా ఎంపికైన వాళ్లు ఎంత వరకూ

చదివితే అంతవరకూ అయ్యే ఖర్చునంతా కాలేజీ వాళ్లే భరిస్తారు. కానీ ఇప్పుడు రామారావు, రూపేష్ ఇద్దరూ ఈ అవార్డుకు ఎంపికయ్యారు- దాంతో వాళ్లకు ఏం చేయాలో అర్థం కాలేదు.

అప్పుడు రూపేష్ "సార్! మా ఇంట్లో డబ్బుల సమస్య లేదు- మా అమ్మా నాన్నలు నన్ను చదివించగలరు. కానీ రామారావు వాళ్ల తల్లి తండ్రులు చాలా పేదవాళ్లు. ఈ డబ్బుల సహాయం లేకపోతే వాడికి ఇక చదువుకునే వీలుండదు. అందుకని ఈ అవార్డుకు రామారావునే సెలెక్ట్ చేయండి" అన్నాడు.

"అవునండి- రామారావు వల్లనే మావాడికి బాధ్యత తెలిసి వచ్చింది. కాలేజీ అయిపోగానే ఇద్దరూ దుకాణంలో పని చేశారు. రామారావుతో పాటు మావాడికీ జీతం ఇచ్చాం. తన జీతం డబ్బులు మొత్తాన్నీ మావాడు పొదుపు చేశాడు- ఆ మొత్తాన్ని కూడా తన వంతుగా రామారావుకు కానుకగా ఇమ్మన్నాడు- అవార్డుతోబాటు ఈ మొత్తాన్ని కూడా రామారావుకు అందించండి. అతను పెద్ద చదువులు చదువుకొని పైకి రావాలనీ, అందరికీ పనికొచ్చే పనులు చేయాలని మా కోరిక!" అన్నారు రూపేష్ వాళ్ల అమ్మానాన్నలు.

తోటి విద్యార్థులు, కళాశాల పెద్దలు అందరూ రూపేష్-రామారావుల స్నేహాన్ని మెచ్చుకున్నారు.

**టిప్పు!**

హెడ్మాస్టరు (కొత్తగా చేరుతున్న పాపతో) : నీ పేరేంటి పాపా?

పాప: టిప్పు

హెడ్మాస్టరు: ముద్దు పేరు కాదు పాపా, అసలు పేరు చెప్పు

పాప: నా అసలు పేరే టిప్పు సార్!

హెడ్మాస్టరు: అదేంటమ్మా?! మీ నాన్న టిప్పుసుల్తాన్ అభిమానా?

పాప: అదేం కాదు సర్, ఆయన హోటల్లో సర్వర్‌గా పని చేస్తాడు. అందుకని నాకు ఈ పేరు పెట్టాడు.



# అందివచ్చిన మంచితనం

*రచన : అఖిల కుమార్, భవానిపురం, విజయవాడ.*
*మార్పుచేర్పులు: కొత్తపల్లి*

సీతాపురం ఊరిపెద్ద శంకరుడు ధనికుడే గాక, చాలా దయాగుణం ఉన్నవాడు. అతనికి పూర్వీకులనుండి సంక్రమించిన ఆస్తులు చాలానే ఉండేవి కానీ, వేరే వ్యాపారాలంటూ ఏవీ ఉండేవి కావు. స్వతహాగా మంచి మనసు కలవాడు కావటంతో అతను తన సమయాన్నంతా ప్రజలకు ఉపయోగపడే పనులకే వెచ్చిస్తూ ఉండేవాడు. ఊళ్ళోవాళ్ళే కాక ఆ చుట్టుప్రక్కల అందరూ అతని గురించి చాలా గొప్పగా చెప్పుకునేవాళ్ళు.

ఒక వానాకాలంలో సీతాపురానికి ఏనాడూ లేనంత భారీ వరద వచ్చింది. తుఫానుకు తోడు చెరువుకూ గండి పడటంతో పెద్ద నష్టమే సంభవించింది. ఆ వరద వల్ల చాలా మంది ఇళ్లు కోల్పోయారు; కొందరు

వరదలో కొట్టుకుపోయారు. శంకరుడు ఉండే భవనం తప్ప ఊళ్ళోని ఇళ్ళన్నీ ఎంతో కొంత కూలిపోయాయి. శంకరుడి భవనానికి మాత్రం ఏమీ కాలేదు.

అయితే కూలిన చెట్లను, సర్వస్వమూ కోల్పోయిన ఇళ్లను చూసి శంకరుడు చాలా బాధపడ్డాడు. ఊళ్ళోని జనాలందరికీ తన భవనంలో చోటు కల్పించాడు; వాళ్ళకు మూడు పూటలా భోజన ఏర్పాట్లు చేశాడు. వరద భీభత్సం తగ్గిన తర్వాత ఇళ్లు కొట్టుకుపోయిన వాళ్ళకు అందరికీ ఇళ్లు కట్టించాడు. ఇళ్ళు కట్టే పని పూర్తయేంతవరకూ అందరికీ తనే ఆశ్రయం ఇచ్చాడు. దీనులైన ప్రజలకు తనే దైవం అయినాడు.

ఈ క్రమంలో శంకరుడు తన తాహతును మించి ఖర్చు చేశాడు. ఇలా దానాలు, ధర్మాలు చేసి చేసి అతని ఆస్తి మొత్తం తరిగిపోయింది. చూస్తూ చూస్తూండగానే అతను పేదవాడైపోయాడు. అంతవరకూ అతన్ని 'మంచివాడు' అని మెచ్చుకున్నవాళ్ళు చాలామంది ఇప్పుడు మొహం చాటు చేయటం మొదలు పెట్టారు. నేను చెప్పాను కదరా, "కూర్చొని తింటే కొండలైనా కరిగిపోతాయి, నీ దానాలూ ధర్మాలూ ఏదో ఒకనాడు నీ తలకే చుట్టుకుంటాయి అని చెబితే విన్నావు కావు!" అని వాళ్ళ అమ్మ కూడా బాధపడటం మొదలు పెట్టింది. కష్టాలు కలిసి వచ్చినట్లు, ఆమె ఆరోగ్యం కూడా అకస్మాత్తుగా మందగించింది. సరైన వైద్యం చేయించేందుకు కూడా శంకరుడి దగ్గర డబ్బు లేదు.

శంకరుడు ఆనాటి వరకూ ఎవరికైనా ఇచ్చిందే తప్ప, ఏనాడూ చెయ్యి చాచి ఎరుగడు. ఇప్పుడు, అతని తల్లి పరిస్థితి ఇలా ఉందని తెలిసి, స్థానికంగా ఉన్న వైద్యులు తమంతట తాముగా వచ్చి, తామే ఔషధాలు తెచ్చి ఇచ్చి వైద్యం చేయసాగారు. కొద్ది రోజులకు ఆమె ఆరోగ్యం మెరుగైంది; కానీ ఇప్పుడిక "బలమైన ఆహారం తినాలి" అన్నారు వైద్యులు.

పేద శంకరుడు "బలమైన ఆహారం ఎక్కడినుండి తేవాలి?" అని

మథనపడసాగాడు. అయితే ఆ చుట్టుప్రక్కల ఉన్న రైతులు అతనికి బాసటగా నిల్చారు. ప్రతి ఒక్కరూ తాము పండించిన కూరలు, పళ్ళు వేటికవి తెచ్చి ఇవ్వటం మొదలు పెట్టారు.

"మీ అందరి రుణం నేను ఎలా తీర్చుకోను?!" అని బాధ పడేవాడు శంకరయ్య. "మీరు ఇంతకాలం మాకు చేసిన సాయాన్ని మరచిపోతే మేం మనుషులం ఎలా అవుతాం?!" అనేవాళ్ళు వాళ్ళు.



సరిగ్గా అదే సమయానికి ఎన్నికలు వచ్చాయి. "ఈ ప్రాంతంలో ప్రజల్లో మంచి పేరున్న కొత్త వ్యక్తికి ఎవరికైనా అవకాశం ఇవ్వాలి" అనుకున్న రాజకీయ పార్టీ వాళ్ళు ఒకరు వచ్చి శంకరయ్యను శాసనసభ్యుడిగా ఎన్నికల్లో నిలబడమన్నారు. "ఒక పార్టీ తరపున నిలబడితే మరొకరితో పోటీ పడాలి. నాకు ఈ పోటీలూ వద్దు, ఈ రాజకీయాలూ వద్దు. అయినా ఎన్నికల్లో ఖర్చు చేసేందుకు నా దగ్గర ఏమాత్రం డబ్బులు లేవు" అన్నాడు శంకరయ్య. అయినా రాజకీయపార్టీలన్నీ కలిసి పోటీ లేకుండా అతన్ని ఏకగ్రీవంగా ఎన్నుకున్నాయి- పేద శంకరుడు నేరుగా శాసన సభ్యుడు అయిపోయాడు.

"అందరికీ సాయపడేందుకు మళ్ళీ అవకాశం వచ్చింది" అని మళ్ళీ పనిలోకి దిగాడు శంకరుడు. ప్రభుత్వం అండదండలు తోడవ్వటంతో మంచిపనులు అనేకం చేపట్టాడు. "శంకరయ్యకు డబ్బులు లేకుంటేనేమి, ఆయన మంచితనమే ఆయనకు అందివచ్చింది" అనేవాళ్ళు అందరూ.



# దుష్కర్మ ఫలం

బౌద్ధకథ

*కథనం: నారాయణ, కొత్తపల్లిబృందం.*

చీనీ దేశంలో హూణుల పరిపాలన సాగుతున్న రోజులవి. ఆ రోజుల్లో కక్షలు, కార్పణ్యాలు చాలా ఎక్కువగా ఉండేవి అక్కడ. 'యువాన్-నంగ్' అనే ఉడుకు రక్తపు కుర్రవాడు చేసి పెట్టమన్న పనినేదో 'చావో-సో' అనే తోటి ఉద్యోగి ఒకడు చేసిపెట్టలేదు. దాంతో వాడికి చాలా కోపం వచ్చింది. అదను చూసుకొని 'చావో-సో'ను నిర్దాక్షిణ్యంగా చంపేసాడు వాడు.

అయితే ఆ తర్వాత వాడికి ఇక శాంతి లేకుండా పోయింది. ఏవేవో ఆలోచనలు రావటం మొదలు పెట్టాయి. పగలూ - రాత్రీ ఎడతెరిపి లేకుండా ఆలోచనల వరద మొదలైంది. వాటి మధ్య , వాడికి 'చావో-సో' ఆకారం కనిపించటం మొదలెట్టింది. "హి హి హి" అని అరిచేదది - "నన్ను అన్యాయంగా చంపేస్తావా? ఇక చూడు - నిన్నేం చేస్తానో చూడు!" అని పళ్లుకొరికేది. 'యువాన్-నంగ్' దాని బారి నుండి తప్పించుకునేందుకు గాను ఎక్కడెక్కడో

తిరిగాడు. ఎవరెవరో మాంత్రికులను, భూతవైద్యులను, డాక్టర్లను సంప్రతించాడు. ఏం చేసినా ప్రయోజనం లేకపోయింది. ప్రతిరోజు 'చావో-సో' ఆకారం వాడి కళ్ల ముందుకు వస్తూనే ఉంది. బెదిరిస్తూనే ఉంది. ఆ దెబ్బకు వాడికి తిండి సయించలేదు; చిక్కి శల్యమైపోయాడు.

ఆ సమయంలో వాడి మేలు కోరేవాళ్లెవరో వాడికి ధర్మమార్గాన్ని చూపారు: ధ్యానం నేర్పారు. ధ్యానం చేస్తూ చేస్తూంటే వాడికి ఇక ఆ ఆకారం కనబటటం మానేసింది. వాడి భయం దూరమైంది!

దాంతో 'యువాన్-నంగ్'కు ధర్మం పట్ల ఆసక్తి పెరిగింది. సన్యాసం స్వీకరించాడు; చాలా శాస్త్రాలు, గ్రంధాలు చదివాడు; తనే స్వయంగా చాలా మందికి దారి చూపి మార్గదర్శకుడైనాడు. గొప్ప ధార్మికుడుగా పేరుగాంచాడు.

ఆ క్రమంలో వాడి మనసు కూడా చాలా పరిశుద్ధం అయ్యింది. అధికారాన్ని గాని, పేరు ప్రతిష్ఠలను గానీ కోరలేదు వాడు. ఏం చేసినా నిస్వార్థంగా , సేవాభావంతో చేయటంతో వాడి జన్మధన్యమైంది, అట్లా చావో - సో ఆలోచన నుండి తప్పించుకున్నాడు వాడు.

తరువాత వాడు పది జన్మలెత్తాడు, ప్రతి జన్మలోనూ తన సాధనని నిష్కల్మషంగా, నిరంతరాయంగా కొనసాగిస్తూనేపోయాడు. అతని పుణ్యకర్మల ఫలితంగా అతని పేరుప్రతిష్ఠలు జన్మజన్మకీ పెరుగుతూ పోయాయి. చివరికి, పదోజన్మలో వాడు చక్రవర్తి గారికి ప్రీతి-పాత్రుడైనాడు. చక్రవర్తికి అంతరంగికుడుగా, గురువుగా, రాజ్యంలో అతని మాటకు తిరుగులేని పరిస్థితి ఏర్పడింది.

జాతి గురువు - 'వు - తా' అని బిరుదు నిచ్చిన చక్రవర్తిగారు, ఆయన్ని విపరీతంగా అభిమానించారు. తన గౌరవాన్ని వ్యక్తం చేస్తూ చక్రవర్తులు మాత్రమే ఉపయోగించే సింహాసనం ఒక దానిని ఆయన ప్రత్యేకంగా చేయించి 'వు - తా' కు సమర్పించుకున్నాడు. దాన్ని ఎంత చక్కని కర్రతో, ఎంత అందంగా తయారు

చేశారంటే, ఎవరైనా దాన్ని మెచ్చుకో-వలసిందే. ఎంతంటి వారైనా ఆ కళా-నైపుణ్యం ముందు తలవంచవలసిందే.



దాని మీద కూర్చొని, 'వు - తా' ఒక్క క్షణం పాటు సంతోషాన్ని పట్టలేకపోయాడు. ఆ క్షణంలో ఒక ఆలోచన అతనిలోకి ప్రవేశించింది - మెల్లగా అతన్ని అది వశం చేసుకున్నది. అతను అనుకున్నాడు - "ఆహా! నా అంత గొప్ప జ్ఞానులు వేరే ఎవ్వరైనా ఉన్నారా, అసలు?! సృష్టిలోనే ఈ కుర్చీ అత్యద్భుతం కదా! ఇంత గొప్ప బహుమానం నాకు కాక వేరే ఎవరికీ దక్కలేదు గదా, అది కూడా చక్రవర్తుల వారి స్వహస్తాల మీదుగా?" అని.

అహంకార పూరితమైన ఆ ఒక్క ఆలోచనా అతను అన్ని జన్మలుగా కప్పుకున్న రక్షణ కవచాలను అన్నిటినీ ఆ ఒక్క క్షణాన్నే పగుల గొట్టింది. పది జన్మలుగా ఏ పాపాన్నైతే అతను అణచిపెట్టాడో అది తక్షణమే తలెత్తింది. బలంగా అతన్ని తాకింది!.

మరుక్షణంలో జాతి గురువు - 'వు - తా' గారి కాలు వాచిపోయింది! ఎర్రగా కమిలినట్లు అయిపోయిన ఆ కాలి పైన ఒక పెద్ద పుండు తయారైంది! మనిషి ముఖం ఆకారంలో ఉన్నదది! ముక్కు, కళ్లు, నోరు, చెవులు!

అంతేకాదు; అది 'వు-తా గారితో ప్రత్యేకంగా మాట్లాడటం కూడా మొదలు పెట్టింది - "నువ్వు నా నుండి తప్పించుకున్నాననుకున్నావు కదూ?! కానీ తప్పించుకోలేవు! నిన్ను ఏం చేస్తానో చూడు!" అనటం మొదలుపెట్టింది, "నాకు

ఆకలిగా ఉంది! మాంసం కావాలి నాకు- పచ్చిమాంసం! అది ఇచ్చావా సరి, లేకపోతే ఇదిగో - ఈ బాధని భరించు!" అని అరిచేది. దాంతో 'పు-తా'కు భరించరాని వేదన కల్గేది. జాతి గురువు ఐనా సరే, ఆయన రహస్యంగా పచ్చిమాంసం తినాల్సి వచ్చింది; అలా కాకపోతే నొప్పి తగ్గేది కాదు మరి!



కొద్దిరోజుల్లోనే 'పు - తా' గారి బ్రతుకు దుర్భరం అయిపోయింది. ప్రతిరోజూ రహస్యంగా పచ్చిమాంసం తినటం, ఆ సంగతి ఎవ్వరికీ తెలీకుండా కాపాడుకోవటం అంటే మాటలు కాదు గదా, మరి?! అయితే అనేక జన్మలలో ధ్యానం బాగా చేసి ఉండటం మూలాన, ఆయనలో క్షమత బాగానే పెరిగి ఉన్నది. ఈ సమస్యకి కారణం కూడా ఆయనకు అర్థమైంది. ఆయన తన గురువు 'కకుడి'తో ఈ సంగతిని చెప్పుకొని పశ్చాత్తాప పడ్డాడు.

'ఇన్ని జన్మల పుణ్య సంస్కారాలనూ పశ్చాత్తాపపు అగ్నిలో దహిస్తే ఫలితం ఉండవచ్చు' అన్నాడు కకుడి.

'పు - తా' ఆ పనే చేశాడు. తన పుండుకు రహస్యంగా దుష్ట ఆహారాన్ని ఇవ్వటం మానివేశాడు. బాధని భరించాడు. మనసును ప్రతిరోజూ పశ్చాత్తాపపు అగ్నిలో నిశ్చలంగా నిలిపి దహింపజేశాడు.

అతని పాపభారం, అప్పటికి గానీ ఉపశమించలేదు!

క్రమేణా అతనికాలు బాగైంది!

మనం కూడబెట్టుకునే దుష్ట సంస్కారాలు అప్రయత్నంగా దూరం కావు! వాటిని అభ్యాసం ద్వారా, ప్రయత్న పూర్వకంగా తొలగించుకోవాలి.



# ఒక లంచం కథ

రచన: నారాయణ

బొమ్మలు : S.ప్రసాద్, తొమ్మిదో తరగతి, రాంబిల్లి, విశాఖపట్నం జిల్లా.

హరి ఇప్పుడు ఐదో తరగతి. వాడికి పాటలు పాడుకోవటం, తోటి పిల్లల్ని బెదిరించడం, వీలైతే సెల్‌ఫోన్‌తో ఆటలాడటం ఇష్టం. చదువులంటే మటుకు అస్సలు ఇష్టం లేదు. సహజంగానే టీచర్లంతా వాడిని తిట్టేవాళ్ళు; మార్కులు తక్కువ వేసేవాళ్లు; దాంతో వాడి అమ్మానాన్నలకి ఎక్కడలేని కష్టం తోచేది.

"వీడిని ఎట్లా అయినా బాగా చదివించాలయ్యా" అనేది వాళ్లమ్మ. "చూస్తుండే! నా కొడుకు బంగారం. వాడిని మంచి బళ్లో వేసి చదివిస్తా. వాడు గొప్ప ఆఫీసరవుతాడు చూడు!" అనేవాడు వాళ్లనాన్న రాజయ్య. ఆయనకు కొడుకంటే గొప్ప గారాబం.

రాజయ్య మామూలు చిన్న రైతు. రెండేళ్లుగా పొలాలన్నీ బీడు పెట్టుకొని ప్రభుత్వం వాళ్లిచ్చే సాయం కోసం చేతులు చాపుకొని కూర్చున్నారు ఆ ప్రాంతపు రైతులందరూ.



రాజయ్యదీ అదే పరిస్థితి. పంటలు లేవు. పనులు లేవు- ఆఫీసుల చుట్టూ తిరగటం, ఏ పథకంలో కొంచెం డబ్బులు వస్తాయోనని ఏ రోజుకా రోజు పథకాలు రచించడం- ఇదే పని!

అట్లా బ్రతికీ బ్రతికీ రాజయ్యకు ప్రభుత్వ పథకాలలోని లొసుగులు బాగా ఒంటి పట్టాయి-"ఏ పథకానికి ఎవరైనా అర్హులు కావొచ్చు- ఆ సారుకు కొంచెం, ఈ సారుకు కొంచెం లంచం ఇస్తే చాలు" అనుకోసాగాడు.

హరి పరిస్థితి రాజయ్యకు తెలుసు. అయితే నేమి, తండ్రి కదా!. ఎలాగైనా ప్రభుత్వం వారి 'నవోదయ' బళ్లో చేర్పిస్తే భలే ఉంటుంది. అక్కడైతే టీచర్లు రోజూ బడికి వస్తారు, పాఠాలు సక్రమంగా చెబుతారు; నా కొడుకుని దారిలోకి తెస్తారు. భోజనాలు బాగా పెడతారు; పుస్తకాలు-వగైరాలన్నీ ప్రభుత్వ ఖర్చుతోటే గడిచిపోతాయి" అని, కొడుకు చేత ముందుగానే అప్లై చేయించి, పరీక్ష జరిగే రోజున వాడిని తీసుకొని పరీక్ష కేంద్రానికి వచ్చాడు.

అక్కడికి వచ్చిన పిల్లలందర్నీ చూసి హరికి ఏమి అనిపించలేదు గానీ, రాజయ్యకి మటుకు చాలాభయం వేసింది. "ఇంతమంది పిల్లలు పరీక్ష రాస్తే, ఇక మా వాడికి ఏం అవకాశం?" అనిపించింది. అక్కడ కనిపించిన ఒక సారుని అడిగాడు-"ఎంతమందికి సీట్లు వస్తాయి సార్?" అని. "ఎనభై మందిలో ఒక్కరికి మాత్రం" అన్నాడాయన. "అవునా, అంత పోటీనా? అన్నాడు రాజయ్య"

మరేమనుకుంటున్నావు? ఇందులో సీటు ఏమంత సులభంగా రాదు" అని చక్కా పోయాడా సారు.




రాజయ్యకు చాలా బెంగ వేసింది. తను ఇది ముందుగా ఊహించలేదు గానీ, లేకపోతే ఏ యం. ఎల్. ఏ గారి చేతనో ఒక సిపారసు పత్రం వెంట తెచ్చును! ఇప్పుడెలాగ? రాజయ్య కళ్లు అటూ, ఇటూ వెతికాయి. అక్కడ, గేటు ప్రక్కనే, ఖాఖీ చొక్కా వేసుకొని ఓ 'వాచ్‌మ్యాన్' కనిపించాడు. రాజయ్య అతని దగ్గరకు పోయి-

"నీదే ఊరు?" అని అడిగేశాడు.

'ఈ ఊరే' అన్నాడు వాచ్‌మ్యాన్.

"ఇక్కడ చాన్నాళ్ల నుండి ఉన్నావా?"

-"ఎందుకు?"

"ఏం లేదు! మావాడిని కొంచెం చూసుకుంటావేమోనని-" హరిని చూపిస్తూ అన్నాడు రాజయ్య.

"ఇందులో, అట్లాంటి వేమీ ఉండదన్నా, మన చేతిలో ఏదీలేదు"

"అబ్బే, అట్లాకాదు నేననేది; మన సార్లకి ఎవరికన్నా చెబుతావేమో, వాళ్లకి కూడా ఎంతో ఒకంత ఇస్తాను నేను- అని"




-అంతలోనే ఎవరో తల్లి తండ్రులు అటుగా రావటం, వాచ్‌మ్యాన్ ప్రక్కకి జరిగి వాళ్లని

పోనివ్వటం జరిగాయి.

"కుదరదన్నా, అట్లాంటిదేమైనా ఉంటే నేను-" అతను ఇంకా వాక్యాన్ని పూర్తి చేయకనే రాజయ్య చేతిలోంచి ఐదు వందలు రూపాయలు అతని జేబులోకి చేరాయి.

"అతనొక సారి రాజయ్య వంకా, తన జేబు వంకా చూసుకొని-"సరే, ఎవరైనా తెలిసిన అయ్యవారు కనిపిస్తే చెబుతాను, కానీ-" అన్నాడు.

రాజయ్యకి ఊరట- "ఇక భయం లేదు. హరి గాడికి ఫర్లేదు" అని. "సారుకు కూడా ఏమైనా ఇవ్వాలేమో చెప్పు, ఇద్దాం!" అన్నాడు ఉత్సాహంగా.

వాచ్‌మ్యాన్ ఇక కనబడలేదు. పరీక్ష మొదలైంది; ముగిసింది. 'వాచ్ మ్యాన్ గానీ సారుగానీ నీకు ఏమైనా అందించారా?" అడిగాడు రాజయ్య, హరిని.

"లేదు- ఎవ్వరూ ఏదీ అందించలేదు. అందరికీ వేరు వేరు ప్రశ్న పత్రాలు ఇస్తారంట. కాపీ కొట్టినా ఏమీ లాభం ఉండదంట- నా ప్రక్కన కూర్చున్న వాడు చెప్పాడు!" అన్నాడు హరి.

'మరి నువ్వేం చేశావురా, రెండు గంటలసేపు?' చిరాకుగా అరిచాడు రాజయ్య. జవాబుగా అట్టమీద పెన్సిల్‌తో దరువు వేశాడు హరి!



దూరం నుండి వీళ్లనే చూసిన ఆటో డ్రైవర్ ఓబులేసు తల తిప్పుకున్నాడు. తను వెంట బెట్టుకొచ్చిన పిల్లల్ని గబగబా ఆటో ఎక్కించుకున్నాడు. పరీక్షకు ముందు రాజయ్య తన జేబులోకి బలవంతంగా ప్రవేశ పెట్టిన ఐదు వందల్నీ మరోసారి పదిలపరుచుకుంటూ, ముసిముసిగా నవ్వుకొని ఆటోను ముందుకు దూకించాడు. ★




# దుర్వినియోగం

*"ఈ మంత్రాలు, చింతకాయలు ఇంతే- అసలు ఇవి వద్దే వద్దు బాబూ" అనిపించింది, ఈ కథ చదివాక. మీకేమనిపించిందో చెప్పండి..?!*

*రచన: 'వియోగి', కర్నూలు.* *సౌజన్యం: 'మామ్మ కథలు '*

ఆ ఊరికి ఆనుకునే నల్లమల అడవులున్నాయి. ఆ ఊళ్ళో చలపతి అతని కుటుంబం మగ్గాలు పెట్టుకుని- బట్టలు నేసి బ్రతుకున్నారు.

కానీ ఈ మధ్య అతని వస్త్రాలు కొనేవాళ్లు కరువైపోయారు. అతనికి పోటీగా చాలా సాలె కుటుంబాలు వలస వచ్చాయి ఊళ్ళోకి. వాళ్ళు ఇతని కంటే అందంగా చీరలు నేస్తున్నారు. దాంతో ఇతని వస్త్రాలకు గిరాకీ పడిపోయింది.

చలపతి కుటుంబం అప్పులపాలైపోయింది. ఆ అప్పులు తీర్చే ఆధరువూ లేదు. భార్యాభర్తలు ఇద్దరూ జీవితంతో విసిగి-పోయారు. చివరికి చలపతి, చంద్రమ్మ

ఇద్దరూ అడవికి చేరుకున్నారు. ఆ రోజున ఎండ విపరీతంగా ఉండింది. ఇద్దరూ బాగా అలసిపోయారు. తెచ్చుకున్న చద్ది తిని, కాసేపు విశ్రమించి, -ఆ తర్వాత రాత్రికి ఆత్మహత్య చేసుకుందామనుకున్నారు. దగ్గరలోని చెలమ దగ్గర కాళ్లు చేతులు కడుక్కున్నారు. ఒక మర్రి చెట్టు క్రిందికి చేరారు. చద్దిమూట విప్పుకొని భోజనానికి కూర్చున్నారు.



ఇంతలో ఒక సాధువు అతి నీరసంగా, నడవలేక నడవలేక నడుస్తూ అటుగా వచ్చాడు- "భిక్షాందేహి!" అంటూ వాళ్ల ముందు నిలబడ్డాడు.

"అడవిలో కూడా అడుక్కుతినే వాళ్లున్నారా?" ఆశ్చర్యంగా అడిగాడు చలపతి.

"ఏం చెప్పను? అనారోగ్యంతో బాధపడు-తున్నాను. పండ్లు, ఫలాలు అరగడం లేదు. వరి అన్నం దొరకడం లేదు. ఆకలితో నకనకలాడుతున్నాను" సాధువు తన బాధ చెప్పుకున్నాడు.

భార్య వంక చూశాడు చలపతి. ఆమె తల ఊపింది. "ఎలాగూ మనం ఇద్దరం చచ్చిపో-బోతున్నాం. తిండి తిని చచ్చినా ఒకటే-తినక చచ్చినా ఒకటే. కాబట్టి, మనకు వేరే నష్టం ఏమీ లేదు" అనుకున్నారిద్దరూ. సాధువును కూర్చోమని భోజనం పెట్టారు.

సాధువు తృప్తిగా భోజనం చేశాడు. కొంత కుదుట పడ్డ తర్వాత "నా ప్రాణాలు కాపాడారు. మీకేం కావాలో అడగండి-నాకు చేతనైనంత సహాయం చేస్తాను" అన్నాడు.

"స్వామీ! మీరు మాకేం చేయగలరు? ఎలాగూ మేము ఈ సాయంత్రానికల్లా ఉరి వేసుకొని చచ్చి పోతున్నాం!" నిరాసక్తంగా చెప్పాడు చలపతి.

"అవునా, తల్లీ! నిజమా? ఎందుకిలాగ?!" చంద్రమ్మను అడిగాడు స్వామి.

తమ కష్టాలన్నీ ఏకరువు పెట్టింది చంద్రమ్మ.

చేనేత బ్రతుకులు ఎంత చీకటి మయం అయిపోయాయో వివరించింది. "దిక్కులేక ప్రాణాలు వదల దల్చుకున్నాం" అని తెలిపింది.

"ఇంత చిన్న దానికి చావాల్సిన అవసరం ఏముంది? మీ సమస్యకు నాదగ్గర ఉపాయం ఉంది-" అన్నాడు సాధువు.

"ఏంటి స్వామీ, అది?" చలపతి అడిగాడు.

సాధువు అతని చెవిలో ఒక మంత్రాన్ని బోధించాడు.

"ముందు ఈ మంత్రాన్ని ఒక లక్షసార్లు జపం చేస్తే అది శుద్ధి అవుతుంది. ఆ తరువాత నలభై రోజులపాటు వరసగా రోజుకు నూట ఎనిమిది సార్లు జపించు. ఆ సరికి నువ్వు అత్యంత ధనవంతుడిగా మారిపోతావు.

కానీ ఈ మంత్రాన్ని దుర్వినియోగం చేయొద్దు. అలా చేస్తే వచ్చే పరిణామాలను ఎవ్వరమూ ఆపలేం" చెప్పేసి, తన దారిన తాను వెళ్లిపోయాడు సాధువు.

భార్యాభర్తలిద్దరూ తాము అసలు అడవిలోకి ఎందుకొచ్చారో కూడా మర్చిపోయి, చక చకా ఇంటి దారి పట్టారు.

మంత్రాన్ని నిష్ఠగా సాధన చేశాడు చలపతి. నలభైరోజులు అవుతుండగానే, అకస్మాత్తుగా ఒకరోజున అతని ముందు ఒక దయ్యం ప్రత్యక్షమయ్యింది- "ఏం కావాలి స్వామీ?" అని అడుగుతూ.

మొదట చలపతి దాన్ని చూసి భయపడ్డాడు. కాని ఆ దెయ్యం "స్వామీ!" అని సంబోధించింది కదా, అందుకని ధైర్యం తెచ్చుకొని తన కష్టాలు ఏకరువు పెట్టాడు.



"ఏమీ పర్లేదు స్వామీ! నేను, నాకుటుంబం ఓ పదిమందిమి నీకు బానిసలుగా ఉంటాం. కోరినన్ని డబ్బులు సమకూరేవరకూ నీకు సహాయం చేస్తాం.

రాత్రంతా కూర్చొని, నీకు నచ్చేట్లు, అత్యంత

నాణ్యమైన చీరలు నేసిస్తాం. నువ్వు అవి అమ్ముకుని బాగుపడచ్చు- కానీ గుర్తుంచుకో, ఏ రోజుకారోజు తెల్లవారేలోగా మాకు ఆహారం పెడ్తూ ఉండాలి" అన్నది దెయ్యం, అదృశ్యమౌతూ.

చలపతికి ఎక్కడలేని సంతోషం కలిగింది. షావుకారు దగ్గర అప్పు చేసి, చీరలకు కావల్సిన ముడి వస్తువులు తెచ్చుకొని ఇంట్లో పెట్టుకున్నాడు. అతను, అతని కుటుంబం వాటితో నేత నేసి, చీరలు తయారు చెయ్యాలంటే నెల రోజులు పడుతుంది.

ఆ రాత్రి మగ్గాల చప్పుళ్లు అవుతూంటే లేచి కూర్చున్నాడు చలపతి. దెయ్యాలు మగ్గాల మీద వస్త్రాలు నేస్తున్నాయి. వాటిని, వాటి వేగాన్ని చూస్తే చలపతికి బలే అనిపించింది.

సంతోషంగా సాధువును మనసులో తలచుకున్నాడు. వాటికోసం పెద్ద గంగాళం నిండా ఆహారం వండి పెట్టి పడుకున్నాడు.

తెల్లారి చూసేసరికి గంగాళం ఖాళీగా ఉంది. అలమార నిండా చీరలున్నాయి. ఇంట్లో ముడి సరుకు అంతా అయిపోయింది.

చలపతికి చాలా సంతోషం వేసింది. వాటిని నేరుగా పట్నం తీసుకెళ్ళి అమ్మేశాడు. ముహూర్తాల సమయం కాబట్టి అన్నీ అమ్ముడు పోయి పదిరెట్ల లాభం తెచ్చి పెట్టాయి ఆ చీరలు.

వచ్చిన డబ్బులతో కొన్ని అప్పులు తీర్చి, మళ్ళీ కావలసినంత ముడి సరుకు కొనుక్కొని ఇల్లు చేరుకున్నాడు.

ఇలా నెల రోజులు తిరిగే సరికలా చలపతి దరిద్రం పోయింది. అతని అప్పులన్నీ తీరిపోయాయి; ఇంట్లో రకరకాల వస్తువులు అమరాయి. బీరువాల్లో నిండుగా డబ్బు కనబడసాగింది.

గ్రామస్తులకు అతనిలోని మార్పు అర్థం కాలేదు. రాత్రి పూట శబ్దాలు వస్తూండటంతో కొందరు మేల్కొని, వాళ్లింట్లో ఏం జరుగుతున్నదా అని చూసేవాళ్ళు- వాళ్లందరికీ ఒట్టి మగ్గాలు చీరలు నేస్తూ కనబడేవి. దాంతో బిత్తరపోయి పరుగెత్తేవాళ్ళందరూ.

సంవత్సరం గడిచేసరికి చలపతి ఆ ప్రాంతంలోకెల్లా అత్యంత ధనవంతుడు

ఐపోయాడు. ధనంతో పాటు అతనిలో పొగరు వచ్చింది; దుర్వ్యసనాలు వచ్చాయి; నిత్యం తాగుడుకు అలవాటు పడ్డాడు. సాధువు చెప్పిన సుద్దులు మర్చిపోయాడు.

"ఇంక చాల్లేండి...పది తరాలకు సరిపోయే ధనం సంపాదించాం. దెయ్యాలను పంపించెయ్యండి. ప్రశాంతంగా బ్రతుకుదాం!" అని భార్య హితం బోధించినా వినలేదు-

"ఇప్పుడే ఏమైంది- నేను ఈ రాజ్యంలోకెల్లా అత్యంత ధనవంతుడ్ని కావాలి!" అంటూ పేరాశకు పోయాడు.



దెయ్యాలు "ఇంక సెలవు ఇప్పించండి"

అంటే "కాదు, ఇంకొంతకాలం నేయండి" అని బలవంత పెట్టటం మొదలుపెట్టాడు. పగటిపూట అవి విశ్రాంతి తీసుకుంటూ ఉంటే పోయి "పని చెయ్యండి" అని కొరడాతో కొట్టసాగాడు. ధనదాహం అలాంటిది- పెరుగుతుందే తప్ప తగ్గదు.

ఒకరోజున బాగా తాగేసి ఒళ్లు తెలియకుండా పడిపోయాడు చలపతి- ఆ రాత్రి దెయ్యాలకు ఏర్పాటు చేయాల్సిన ఆహారం సంగతి మరచే పోయాడు. చంద్రమ్మ, పిల్లలు కూడా విందు వినోదాలలో తేలుతూ బానిసల ఆహారం మాట మర్చిపోయారు.

అంతే! ఊళ్ళోవాళ్ళు తెల్లారి చూసే సరికి చలపతి-చంద్రమ్మ లతోబాటు పిల్లలు కూడా అతి భయంకరంగా, చచ్చిపడి ఉన్నారు!

బానిసత్వం నుండి విముక్తి లభించిన దయ్యాలు ఇక అటు తిరిగి చూడకుండా పారిపోయాయి.

ఆరోజునే అటుగా వచ్చిన సాధువు, చచ్చిపోయిన చలపతి-చంద్రమ్మల గురించి తెలుసుకొని, విచారంగా పెదవి విరిచాడు.




# మార్పు

*ర్యాంకుల లాటరీలో ఎన్ని పసి మనసులు ఇరుక్కొని, నలిగి పోయి, ప్రక్కదార్లు పడుతున్నాయో తలచుకుంటే బాధ వేస్తుంది. ఇదిగో ఈ కథ చదివి చూడండి-*

*రచన: సి. ప్రణయజ, వెంకటేశ్వర బాల కుటీర్, గుంటూరు.*

రాజేష్ వాళ్ళ ఇంటికి నాలుగిండ్ల అవతల శివతేజ వాళ్ళ ఇల్లుంది. రాజేష్, తేజ హైస్కూల్లో ఆరవ తరగతి చదువుతున్నారు. బడికి వెళ్ళేటప్పుడు ఇద్దరూ కలిసే వెళతారు; వచ్చేటప్పుడు కలిసే వస్తారు. బడిలో కూడా ప్రక్క ప్రక్కన కూర్చుంటారు. సాయంత్రం ఇంటి దగ్గర కలిసే ఆడుకుంటారు. మళ్ళీ సాయంత్రం ఆటల తరువాత కలిసే చదువుకుంటారు.

ఎంతసేపు చదివినా తేజ మటుకు చదువులో కొంచెం వెనకే ఉంటాడు. ఇక రాజేష్‌కి ఎప్పుడూ మొదటి ర్యాంకు వస్తుంటుంది; రెండవ ర్యాంకు మరో పిల్లాడు రంగనాథ్‌కి వస్తుంది.

అయినా రాజేష్ తన మార్కుల్ని పెద్ద పట్టించుకోడు- తేజకు చదువు చెబుతుంటాడు; అతనికి మంచి మార్కులు తెప్పించడానికి శత విధాలా ప్రయత్ని-స్తుంటాడు:

"రాజేష్! ఫ్లయింగ్ అంటే ఏమిటి?" ఒక్కోసారి అర్థాలు అడుగుతుంటాడు తేజ.

"ఫ్లయింగ్ అంటే ఎగరడం. పక్షులు ఎగురుతాయి గదా, అది!" వివరిస్తాడు రాజేష్.

"రాజేష్! ఈ జవాబేదో చాలా పెద్దగా ఉంది- గుర్తుండట్లేదు" ఒక్కోసారి బెంగ పడు-తుంటాడు తేజ.

"సులభం, తేజా! ప్రతి పాయింటు ముందు ఒకటి- రెండు అని నెంబర్లు వేసుకో; వాక్యాలను ఆ నంబర్లతో బాటు ఒక వరసలో చదువుకొని చూడు- ఎంత పెద్ద జవాబైనా సులభంగా వస్తుంది-" అని ధైర్యం చెబుతుంటాడు రాజేష్.

"రాజేష్! నాకీ లెక్క అర్థం కావడం లేదు!" ఫిర్యాదు చేస్తుంటాడు తేజ.

"ముందు నీకు సూత్రం రావాలి తేజా! సూత్రం అర్థం అయిందంటే ఇక లెక్క సులభంగా చేయగలవు" అని సూత్రాన్ని వివరిస్తుంటాడు రాజేష్.

ఇలా తేజాకే కాదు, తరగతిలో ఎవరికి, ఏది అర్థం కాకపోయినా ఓపికగా అర్థమయ్యేలా వివరిస్తాడు అతను. అందుకనే పిల్లలందరికీ రాజేష్ అంటే చాలా ఇష్టం. ఉపాధ్యాయులు కూడా చాలా గర్వపడుతుంటారు అతని వ్యక్తిత్వాన్ని చూసి. ఎందుకంటే, చదువులోనే కాదు- చిత్రలేఖనంలోను, వ్యాస రచన-వక్తృత్వ పోటీల్లో కూడా అన్ని ప్రైజులూ రాజేష్‌కే వస్తుంటాయి!

ఇట్లా అన్నింటా మొదటి స్థానంలో ఉండే రాజేష్‌ని చూస్తే రంగనాథ్‌కి చాలా అసూయ. ఎలాగైనా తను కూడా ఫస్ట్ ర్యాంక్ తెచ్చుకోవాలని రంగనాథ్ చాలా ప్రయత్నిస్తుంటాడు; కష్టపడి చదువుతాడు కూడా- కానీ ప్రతిసారీ పరీక్షల్లో ఏదో తప్పుచేసి ఒకటో, రెండో మార్కులు రాజేష్ కంటే తక్కువ తెచ్చుకుంటాడు! దానితో రాజేష్ మీద రోజు రోజుకూ కసి ఎక్కువయ్యింది అతనికి.

అర్ధ వార్షిక పరీక్షలు అయ్యాయి- అందరూ 'బాగా రాశాం'అని సంతోషపడ్డారు. ఆ వెంటనే క్రిస్మస్-సంక్రాంతుల కోసమని పది రోజులు సెలవులు కూడా ఇచ్చారు. పిల్లలంతా ఆటల్లో మునిగారు.

కానీ సెలవులు ఇంక రేపటితో ఐపోతాయనగా, రాజేష్ కోతి కొమ్మచ్చి ఆడుతూ చెట్టుమీదినుండి క్రింద పడ్డాడు- పాపం, అతని కాలు విరిగింది!

డాక్టరుగారు కాలికి పిండి కట్టు వేసి, మూడు వారాల పాటు ఇంట్లోనే ఉండమన్నారు! రాజేష్‌కి ఏడుపు ఆగలేదు: బడి తెరిచిన రోజునే అన్ని సబ్జెక్టుల్లోనూ మార్కులిస్తారు మరి! ఏ సబ్జెక్టులో ఎన్ని మార్కులొచ్చాయో తెలుసుకోవాలని ఆత్రంగా ఉంది అతనికి.

ఆ రోజు సాయంత్రం తేజ పరుగెత్తుకొచ్చాడు. దిద్దిన జవాబు పత్రాలను రాజేష్ వాళ్ల ఇంటికి పంపించారు మాస్టారు: ఈసారి కూడా మొదటి ర్యాంకు రాజేష్‌దే ! తేజాకి కూడా గతంలో కంటే మంచి మార్కులు వచ్చాయి!

ఆ రోజున తేజ వాళ్ళమ్మ రాజేష్‌కి ధన్యవాదాలు చెప్పింది. "నీవల్లనే తేజాకి మంచి మార్కులు వచ్చాయి" అని మెచ్చుకున్నది.

అయితే అక్కడ రంగనాథ్ చాలా సంతోషించాడు- "రాజేష్‌కి కాలు విరిగింది! మూడు వారాలు బడికి రాడు! ఈసారి ఫస్టు ర్యాంకు నాదే!" అని.

అయినా అతనికి రాజేష్ మీద ఉన్న అక్కసు తగ్గలేదు- 'రాజేష్ స్నేహితుడైన తేజాను చెడగొడతాను చూడు- వాడు ఏం చేస్తాడో చూస్తాను' అనుకున్నాడు.

మరుసటి రోజు అసెంబ్లీలో తేజ పక్కన నుంచున్నాడు రంగనాథ్: "ఏయ్ తేజా! నీ ఫ్రెండ్ రాజేష్ రావడం లేదు కదా! మా బెంచీలో నా దగ్గర కూర్చో. నీకు అర్థం కానివి చెబుతాను" అన్నాడు కొంటెగా. తేజా వెళ్ళి రంగనాథ్ దగ్గర కూర్చున్నాడు.

ఫస్టు పీరియడ్‌లో లెక్కలు మాస్టారుగారు లెక్కలు చెప్తున్నంతసేపూ రంగనాథ్ ఏదేదో మాట్లాడుతూనే ఉన్నాడు: ఆరోజున లెక్కలేమీ అర్థం కాలేదు తేజకి. రంగనాథ్

అన్ని పీరియడ్లలోనూ అలాగే చేశాడు: చివరికి మాష్టారిచ్చిన నోట్సును కూడా పూర్తిగా రాసుకోలేదు తేజ-

"ఏంటి తేజా, ఇట్లా రాశావు? ఏ ఒక్క అంశమూ పూర్తిగా రాసుకోలేదు- ఏమైంది?" అడిగాడు రాజేష్, ఆరోజు సాయంత్రం నోట్సులు చూస్తూ.

రంగనాథ్ ఏం చేశాడో వివరంగా చెప్పాడు తేజ. "రేపటి నుండీ అతని దగ్గర కూర్చోకు- సుధీర్ దగ్గర కూర్చో. సుధీర్ మంచివాడు; నీకు సహాయం చేస్తాడు!" అన్నాడు రాజేష్.

కాని స్కూల్లో రంగనాథ్ తేజాను వదలలేదు; పాఠాలు విననివ్వలేదు.

ఇక ఆరోజు సాయంత్రం రాజేష్ దగ్గరకి వెళ్ళటానికి భయపడ్డాడు తేజ. ఇక ఆరోజు మొదలుకొని రాజేష్‌కి కనిపించటమే మానేశాడు అతను!

తర్వాతి రోజున రాజేష్ వాళ్ళింట్లో పని చేసే శాంతమ్మను పంపించాడు- "శాంతమ్మా! తేజ ఎందుకనో ఇటువైపుకు రావటం లేదు. ఏం జరిగిందో కొంచెం కనుక్కురావా?" అని.

"తేజ ఇప్పుడింక ఇటు రాడట. రంగనాథ్ వాళ్ళ ఇంట్లోనే చదువుకుంటున్నాడట" వెళ్ళి వచ్చాక చెప్పింది శాంతమ్మ. ఆశ్చర్యపోవడం రాజేష్ వంతయ్యింది. "సరేలే" అని మరో స్నేహితురాలు సుజాత దగ్గర నుండి నోట్సు తెప్పించుకొని, తన నోట్సులన్నీ పూర్తి చేసుకున్నాడు అతను. ఏ రోజుకారోజు బడిలో చెప్పిన పాఠాలను తనే సొంతగా చదువుకుంటున్నాడు: అర్థం కాకపోతే వాళ్ళ నాన్న గారితో చెప్పించుకుంటున్నాడు.

ఇక అక్కడ, రంగనాథ్ స్నేహంతో తేజ చాలా పాడైపోయాడు. ఇప్పుడతను పాఠాలు వినడంలేదు; నోట్సులు రాయడంలేదు; అస్సలు చదవడంలేదు.

ఆరోజున రంగనాథ్ తేజతో "తేజా! రేపు చెరువులో ఈత కొడదాం, నువ్వు ప్రొద్దునే చెరువు దగ్గరికి రా!" అన్నాడు.

"బడి ఉంది కదా, ఎలా?" అన్నాడు తేజ అమాయకంగా.

"ఒక్క రోజు బడికి వెళ్ళకపోతే ఏమీ అవ్వదులే" దబాయించాడు రంగనాథ్.

కానీ ఆ రోజున తేజ చెరువుకు వెళ్ళగానే అతను వచ్చి తరగతిలో కూర్చున్నాడు. ఆరోజు సాయంత్రం తేజ కనిపిస్తే "నేనూ వద్దామనుకున్నానురా, తేజా! కానీ దారిలో మాష్టారుగారు కనిపించేసి, నన్ను సైకిలెక్కించుకొని బడికి తీసుకెళ్ళిపోయారు. ఇంక నేను తప్పించుకోలేకపోయాను. రేపు వస్తానులే" అన్నాడు.



అనటమైతే అన్నాడు, కానీ రెండోరోజున కూడా అతను చెరువు దగ్గరికి వెళ్ళనే లేదు! ఆలోగా తేజాకు అక్కడ చెరువులో గొడ్లను మేపుకుంటున్న పిల్లలు కొంతమందితో పరిచయమైంది. ఇంక వాడు రోజూ బడికి వెళ్ళకుండా వాళ్ళతో ఆడుకోవటం మొదలు పెట్టాడు!

త్వరలోనే మళ్ళీ యూనిట్ పరీక్షలు వచ్చాయి. రాజేష్ పరీక్షలకు మాత్రమే వచ్చి పోతున్నాడు. పరీక్ష రాయగానే అతన్ని వాళ్ళ నాన్నగారు సైకిల్ మీద తిరిగి తీసుకెళుతున్నారు. ఒక రోజున రాజేష్‌కి తేజ ఎదురుపడ్డాడు- ఏదో తప్పు చేసిన వాడిలాగా తల దించుకొని వెళ్ళిపోయాడు- రాజేష్ నవ్వినా అతను నవ్వలేదు!

కొద్ది రోజులకు పరీక్షాఫలితాలు వచ్చాయి. ఏ రోజుకారోజు బడికి రాకపోయినా రాజేష్‌కే మొదటి ర్యాంకు వచ్చింది. ఎవరినో పాడు చేద్దామనుకొన్న రంగనాథ్ తాను కూడా సరిగ్గా చదవలేకపోయాడు. వాడికి ఈసారి ఐదో ర్యాంకు వచ్చింది! "చెరపకురా చెడెదవు" అనే సామెత నిజమైంది.

తేజకైతే అన్నింట్లోనూ చాలా తక్కువ మార్కులు వచ్చాయి. కొన్నిటిలో పరీక్ష తప్పాడు కూడాను.

మాస్టరుగారు తేజ వాళ్ళమ్మను బడికి పిలిపించారు: "ఎందుకు తక్కువ

మార్కులు వచ్చాయి?" అని వాడిని గదమాయించారు.

పూస గుచ్చినట్లు అంతా చెప్పాడు తేజ.

మాస్టారుగారు రంగనాథ్‌ని కూడా కోప్పడ్డారు. "ఇతరులకు సాయం చేయడానికి ముందుండాలి. కాని ఇలా తప్పుడు పనులు చేయించి ఇతరులను పాడుచేయకూడదు. అదీకాక నీకు మార్కులు ఎందుకు తగ్గుతున్నాయో, ఎక్కడ తప్పు చేశావో చూసుకొని, ఆ తప్పు మరలా చేయకుండా ఉండాలి కాని, ఇతరులమీద అసూయ పడితే నీకేం వస్తుంది?" అని మంచి మాటలు చెప్పారు.

"రాజేష్! మావాడికి ఇదివరకటిలాగా చదువులో సహాయం చెయ్యవా?!" తేజ వాళ్ళమ్మ బ్రతిమాలింది రాజేష్‌ని.

"నేను తేజకి సహాయం చేయడంలో ఎప్పుడూ ముందే ఉంటాను గానీ, వాడే- నన్ను తప్పించుకొని తిరుగుతున్నాడు. ఇప్పటినుండీ మళ్ళీ మేమిద్దరం కలిసి చదువుకుంటాము. తేజ నా మిత్రుడు!" అంటూ తేజ భుజం మీద చేయి వేశాడు రాజేష్. తేజకు కన్నీళ్ళు ఆగలేదు.

"నన్ను క్షమించు రాజేష్, నీకు ఫస్టు ర్యాంకు వస్తుందన్న కోపంతో నేను తేజమీద పగ తీర్చుకోబోయాను. నాకు తగిన శాస్తి జరిగింది: ఫస్టు ర్యాంకు రాకపోగా, ఐదో ర్యాంకుకు పడిపోయాను. ఇకమీదట నీలాగే నేను కూడా అందరికి సాయం చేస్తాను" అన్నాడు రంగనాథ్ పశ్చాత్తాపంతో. రంగనాథ్‌లోని మార్పుకు అంతా సంతోషించారు. అప్పటినుండీ వీళ్ళంతా కలసి మెలసి చదువుతూ మిగతా పిల్లలకు ఆదర్శంగా నిలిచారు. ★




ఇంటర్వ్యూ ఆఫీసర్: నీ బలహీనతలేంటి?

రాజేష్: నేను ఆఫీసు నుండి ఇంటికి వెళదామనుకున్నాక ఇంక ఏపనీ చేయను.

ఆఫీసర్: ఓహోఁ మరి నీ బలాలేంటి?

రాజేష్: ఆఫీసుకు వచ్చేంత వరకూ నేను ఇంటికి వెళదామనుకోను.



# తెలివైన అత్త

*రచన: చదువుల క్రాంతి, ఇంటర్‌మీడియట్, శ్రీకాకుళం*

సూర్యకాంతంకి ఒక్కడే కొడుకు. భర్త చనిపోయి చాలా కాలం అయిపోయింది. కొడుకు సుందర్ సొంత ఊళ్ళోనే ఉద్యోగం చేస్తున్నాడు.

సుందర్ ఉదయాన్నే ఉద్యోగానికి వెళ్లి, మళ్లీ రాత్రికి గానీ తిరిగి వచ్చేవాడు కాదు. సూర్యకాంతం ఇంట్లో పనులు చేసీ చేసీ అలసిపోయేది. సాయంగా ఎవరూ లేరు- ఒక్కతే ఇంటి పనంతా చేసుకోవాలి. అందుకని తనకు సరిపడే కోడలి కోసం వెతికీ వెతికీ చివరికి 'మీరా' అనే పిల్లను మెచ్చింది.

ఆ పిల్ల అయితే తను చెప్పినట్లు వింటుందనీ, తను ఏమన్నా కిసుక్కుమనదనీ లెక్కలు వేసుకొని, సుందర్‌ని ఒప్పించి వాళ్ళిద్దరికీ పెళ్ళి చేసింది.

మీరా రూపవతి, అందాల బరిణ, ముద్దుల

గుమ్మం. కోడలు ఇంటికొచ్చాక కొద్ది రోజులవరకూ సూర్యకాంతమే అన్ని పనులూ చేసింది. కోడలు అత్తగారిని చాలా బాగా చూసుకున్నది. "నా కోడలు బంగారం రా" అనేది సూర్యకాంతం.



అయితే రాను రాను అసలు రంగు బయట పడ్డది. కోడల్ని కూర్చోబెట్టి సాకే ఉద్దేశం అత్తకు లేదు. అత్తను కూర్చోబెట్టి సాకే ఉద్దేశం కోడలికి లేదు! అత్త ఏదైనా పని చెప్పగానే చటుక్కున లేచి అవతలికి వెళ్ళేది మీరా. కోడలు కనబడగానే లేనిపోని పనులు చెప్పేది సూర్యకాంతం.

"నా కోడలు చూడండమ్మా! నా కొడుకును ఎట్లా కొంగున ముడి వేసుకున్నదో! కోడలంటే అట్లా ఉండాలి!" అని కోడలు చేసే ప్రతీ పనినీ దెప్పి పొడిచేది సూర్యకాంతం.

"ఎంతైనా అత్త అత్తే! అత్త బుద్ధి చూపించుకున్నది చూడు మా అత్త!" అనటం మొదలుపెట్టింది మీరా.

రాను రాను సూర్యకాంతానికి కోడలంటే ఎక్కడలేని కోపం రాసాగింది. కోడలు చేసే ప్రతి వంటకూ ఏదో ఒక వంక పెట్టి "ఇదిగో, ఇది నన్ను చంపడానికే వచ్చింది, నా గుమ్మంలో అడుగుపెట్టింది మొదలు నాకు మనశ్శాంతి లేకుండా పోయింది!" అని కనబడ్డవాళ్ళకల్లా చెప్పేది. "కొడుక్కి చెప్పు" అని వాళ్ళు ఎగద్రోసే సరికి, చివరికి ఆ ఫిర్యాదులన్నీ సుందర్ చెవుల్లో వెయ్యటం మొదలు పెట్టింది సూర్యకాంతం.

తల్లి మాటలను వినీ వినీ సుందర్‌కి పిచ్చెక్కినట్లయింది. "అమ్మా! ముసలి దానివైపోయావు. అదేమో చిన్నది. నీకు దాని పద్ధతులు నచ్చితే సరి- లేకపోతే ఇప్పుడు ఏం చెయ్యగలం చెప్పు- అన్నీ వదిలేసి ఏదో

'రామా!కృష్ణా!' అంటూ కాలం గడుపు!" అనేశాడు.

సుందర్‌కి వీళ్ళిద్దరి గుణగణాలూ తెలుసు. "మీరా పట్నం అమ్మాయి. సూర్యకాంతం ఇప్పుడు పట్నంలో ఉంటున్నా, ఒకప్పటి పల్లెటూరి మనిషే. ఇద్దరి పద్ధతులూ ఒకరివొకరికి సరిపోవు.



సూర్యాకాంతానికి మూఢనమ్మకాలంటే మక్కువ. కోడలివి ఆధునిక భావాలు. కోడల్ని తనదారిన తాను పోనిచ్చే పెద్దరికం తల్లికి లేదు. ఆమె ఏమన్నా భరించే ఓపిక మీరాకు లేదు. ఫలితం ఇలాగే ఉంటుంది.."

చివరికి ఒకరోజున సుందర్ ఇంటికి రాగానే కోడలి మీద వంద చాడీలు చెప్పింది సూర్యకాంతం. అసలే ఆఫీసు గొడవలతో చికాకుగా ఉన్న సుందర్ ఇక భరించలేకపోయాడు. "అమ్మా! నీకు ఎన్ని సార్లు చెప్పాలమ్మా, తిట్టద్దని, శాంతంగా ఉండమని.. ఇక అయ్యేది లేదు. నీకు ఎన్ని కావాలో అన్ని డబ్బులిస్తాను- ఏ కాశీకో, తీర్థయాత్రలకో వెళ్లి కాలం గడుపు- అట్లా పోయావంటే నీకూ శాంతి, నాకూ శాంతి! ఎన్నాళ్లని ఇక్కడ కష్టపడుతూ ఉంటావు?! " అనేశాడు.

కొడుకు మాటలు విన్న సూర్యకాంతానికి భయం వేసింది. "వీళ్ళు నన్ను వదిలించుకునేట్లున్నారు- ఇప్పుడెట్లా?!" అనుకున్నది. బైటికి మటుకు "అప్పుడే పెద్దవాడివి ఐపోయావురా! పెళ్లయి సంవత్సరం కూడా కాకనే నీకు పెళ్లాం తీపయ్యింది; తల్లి చేదయ్యిందట్రా? ఏదో, నీకో కొడుకు పుడితే, వాడిని చూసి అట్లాగే ఏదైనా తీర్థయాత్రకు వెళ్దామని ఆగానుగాని, లేకపోతే నేను ఇక్కడెందుకుంటాను, అసలు?!" అన్నది.

"ఏదో అమ్మా! నీ ఖర్మ కొద్దీ మీరా దొరికింది. ఇప్పుడు తను ఏమంటే అది కానిచ్చి నువ్వు సర్దుకుపో" అని తప్పుకున్నాడు సుందర్.

సంవత్సరం తిరిగే సరికి, మీరాకు చక్కని బాబు పుట్టాడు. సూర్యకాంతం మనవడ్ని చూసి తెగ మురిసిపోయింది. వాడిని ఎత్తుకొని "నిన్ను చూసేందుకేరా, నేను ఇక్కడ కాపలా కుక్కలాగా పడి ఉన్నది; లేకపోతే మీ అమ్మ డాకినితో నేనెందుకుంటాను?" అన్నది.



"కుక్కలాగా ఎందుకత్తా! మనవడిని చూశాక కాశీకి వెళ్లిపోతానన్నావుగా, ఇంక కాశీకి బయలుదేరు!" అంది మీరా ఒళ్ళుమండి.

మీరా మాటలు విన్న సూర్యాకాంతం "అందుకే నమ్మా...'కోడలు కన్నా కొరివిదయ్యం నయం' అన్నారు పెద్దలు! వాళ్ళు చెప్పింది నిజమని నిన్ను చూస్తే తెలుస్తుంది. అయినా నీతో నాకేం పని?! నామనవడికి విద్యా బుద్ధులు గరిపాక ఇంక మీరు ఉండమన్నా, ఉండను గాక ఉండను" అంది అత్త సూర్యాకాంతం, కొంచెం తగ్గి.

పదేళ్ళు గడిచాయి. సుందర్ కొడుకు పెరిగి పెద్దవాడయ్యాడు. వాడికి నానమ్మ రకరకాల ఆటలు, పాటలు నేర్పింది. వాడి ముద్దు మురిపాలలో కొంచెం మెత్తబడింది. అయినా మిరపకాయ ఘాటు ఎక్కడికి పోతుంది? ఒక రోజున మీరాతో తగవు వేసుకున్నది- "వాడిని మంచి బళ్ళో వేయాలి" అని.

మీరాకి కోపం వచ్చేసింది- "అత్తా! మనవడు పెద్దవాడయ్యాక కాశీకి వెళతానన్నావు గదా! ఇంక బయలుదేరు,కాశీకి!" అన్నది.

"ఒసేయ్!ఊరికే నోరు పారేసుకోకే,

పసివాడు, అప్పుడే పెద్దవాడు అయ్యాడటనే, నీ తొందర కూల! వాడి పెళ్ళిని నా కళ్ళారా చూడకుండా నేను ఎక్కడికి వెళ్తానే?!" అంది కోడలిమీద ఒంటికాలితో లేస్తూ.

చూస్తూండగానే మీరా కొడుక్కి పెళ్లి అయ్యింది. పెళ్ళిలో సూర్యకాంతం వాడికో ఉంగరం పెట్టి, "నీ పెళ్ళి చూసేందుకే నాయనా, నా ముసలి ప్రాణం ఈ గయ్యాళి ఇంటి గడపను పట్టుకొని వ్రేలాడుతున్నది!" అని కళ్లనీళ్ళు పెట్టుకున్నది.

"శుభమా, అని మనవడి పెళ్ళి చేస్తుంటే ఇప్పుడీ కళ్ళ నీళ్ళేమిటి?" అని చికాకు పడ్డ మీరా తనూ చెంగు బిగించి- "మరేఁ అత్తా! మనవడి పెళ్ళయిందిగా, ఇప్పుడింక కాశీకి బయలుదేరండి!" అంది.

వికవికా నవ్వింది సూర్యకాంతం. "ఇప్పుడింక నేను తగ్గుతాననుకున్నావా, తగ్గేది లేదు! పదవే కోడలు పిల్లా పద! ఇప్పుడు నువ్వూ అత్తవే, నేనూ అత్తనే! బయలుదేరు- ఇంక ఇద్దరం కలిసి కాశీకి పోదాం పద..వెంటనే బయలుదేరాలి మరి!" అని అరిచింది.

అత్త తిరగబడేసరికి కోడలికి మతిపోయినట్లయింది. ఆమె తెలివికి, మీరా కాస్తా తెల్లబోయి, ఇక మారు మాట్లాడలేక ముఖం దించుకుంది.

"కోడలుకూడా ఒకనాటికి అత్తే! అయినా మా అమ్మని గెలవాలంటే ఎవరికి సాధ్యం?!" చిన్నగా నవ్వుకున్నాడు సుందర్. 

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 ల్లు | 2 హ | | 3 హా | ర | 4 ము |
| | 5 లం | 6 క | | | రా |
| 7 డు | | 8 ధ | న్వం | 9 త | రి |
| 10 తు | మ్ము | లు | | రు | |
| ర | | | 11 గు | పు | 12 త |
| 13 భ | ర్తృ | హ | రి | | ల |

## పదరంగం-71 సమాధానం

ఈ సారి పదరంగాన్ని పూర్తిగా సరిగా నింపిన వాళ్ళు ఎవ్వరూ లేరు. ఒక్క తప్పుతో నింపిన 'శ్రీవంత్-హైదరాబాదు' కు ఈ మాసపు కొత్తపల్లిని బహుమతిగా పంపుతున్నాం

# బొమ్మకు కథ రాయండి!

*నిర్వహణ: కొత్తపల్లి*




ఈ బొమ్మను చూడండి. పిల్లి దర్జా చూశారా? స్కూటీ ఎక్కి కూర్చొని ప్రశాంతంగా కునుకుతున్నది. దీని కథ ఏమైనా రాయగలరేమో చూడరాదూ..? చక్కని నవ్వొచ్చే కథ రాసి మాకు పంపండి. బాగున్న కథని కొత్తపల్లి మే సంచికలో ప్రచురించి, మీకో చక్కని బహుమతి కూడా పంపిస్తాం! మొదలు పెట్టండి మరి!

మా చిరునామా: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A,యంఆర్వోఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101. E-mail: team@kottapalli.in

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**ఉక్కుమనిషి, పెద్దపేరు, ఉచితం, చింతకాయ, వంతెన, అగ్గిపుల్ల, సముద్రం, సారంగాలు, కలుషితం, విరుగుడు, పిచ్చుక, కొండముచ్చు, లోగిలి, అనులోమం, మందులచీటీ, చీకటి, చీమలపుట్ట, అట్టముక్క, పెద్దమనిషి, వాతావరణం-** ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి! వాటి చుట్టూ గుండ్రాలు గీయండి చూద్దాం!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రు | ధ | వ | ర | క | తం | పు | ల | ణం | గి | వా | రం |
| లు | పే | న | మ | షి | చి | గ్గి | ట్ట | పు | ల | మ | చీ |
| ణం | ద | ద్ద | లు | కీ | ఉ | స | క | క్క | ల్లి | లి | లు |
| ర | ర | క | పె | లు | కొం | డ | ము | చ్చు | త్త | ను | గా |
| వ | గు | ర్ర | వు | మం | ని | ట్ట | ప | ద్రం | పి | లో | రం |
| తా | టి | నా | దు | మ | అ | వా | తా | వ | ర | ను | సా |
| వా | క | ల | ద్ద | గ్గి | ద్రం | లో | వి | రు | గు | డు | పె |
| మా | చీ | పె | పు | ధ | డ | ఉ | లి | గా | అ | షి | ద్ద |
| టీ | కొ | ల్ల | య | మం | స | గి | క్కు | గి | ని | ని | పే |
| చిం | బ | ఉ | చి | లం | లో | వ | షి | మ | య | ణ | న |
| చ్చు | చిం | త | కా | య | కీ | ను | ద్ద | ణం | ని | తె | ల్లి |
| అ | క్ష | రా | కా | క్క | ర్వ | పె | అ | గ్గి | వం | షి | పె |

# పదరంగం-75

*నిర్వహణ: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండజిల్లా*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ★ | 2 | | 3 | |
| 4 | 5 | | ★ | | ★ |
| 6 | | ★ | 7 | ★ | 8 |
| 9 | | 10 | | 11 | |
| ★ | ★ | 12 | | | ★ |
| 13 | | | | ★ | 14 |

**అడ్డం**

2. 'గురి'తో మొదలయ్యే గింజ (4)
4. వరుస తప్పిన 'సందడి' (3)
6. చెక్కను కోసే పనిముట్టు (2)
9. ఈ పాలు గరిటెడైనా చాలట! (6)
12. మనది కానిది (3)
13. 'రైతన్న' బహువచనం (4)
14. ఆంగ్లంలో 'ఆవు' (2)

**నిలువు:**

1. విశ్వనాథ్ ఆనంద్ ఈ ఆటలో ప్రసిద్ధుడు (4)
2. 'దేవాలయం' మరో పేరు (2)
3. భారతదేశంలో ఉన్న పెద్దపర్వతాలలో ఒకటి (2)
5. 'సం'తో మొదలయ్యే ఒక పువ్వు, గొప్ప సువాసన కలది (3)
7. పావురానికి బహువచనం (4)
8. నడవడానికి ఉపయోగించే శరీరభాగాల్లో ముఖ్యమైనది (2)
10. గోపకిశోరుడ్ని వాడుక భాషలో ఇలా అంటాం (3)
11. 'రూపాయి'లో మొదటి అక్షరం మాయమైపోయింది(2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి-77 ని బహుమతిగా పంపిస్తాం!

మా చిరునామా:

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

స్వాగతం!

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు. పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. సాయం చేయండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !

**వెలల పట్టిక:**

| | వ్యక్తులు | సంస్థలు | బ్యాంకు ట్రాన్సుఫరు కోసం అక్కౌంటు వివరాలు: Kottapalli Prachuranalu, S.B. A/c No: 62320333310 SBH- Dharmavaram Branch, ISFC code: SBHY0020902 |
|---|---|---|---|
| విడి ప్రతి వెల (పోస్టేజీ అదనం) | 25 రూ. | 25 రూ | |
| సంవత్సర చందా (సాధారణ పోస్టు) | 300 రూ. | 350 రూ. | |

సంవత్సర చందాను మనిఆర్డరు/బ్యాంకు ట్రాన్సుఫరు ద్వారా చెల్లించవచ్చు. **దయచేసి మీ చిరునామాను పోస్టు / యస్సెమ్మెస్ / ఇ-మెయిలు ద్వారా విడిగా తెలియజేయండి.** పుస్తకాలను సాధారణ పోస్టులో పంపుతాం, రచయితలు, చిత్రకారులు దయచేసి తమ రచనలను పోస్టు / ఇమెయిలు రూపంలో పంపగలరు. పిల్లల చేత పాడించిన చక్కని పాటల ఆడియోలనూ మాకు పంపండి. పిల్లలకు ఉపయోగకరంగా ఉండేవాటిని తప్పక ప్రచురిస్తాం!


కొత్తపల్లి ప్రచురణలు

1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర,

చెన్నేకొత్తపల్లి- 515101

అనంతపురం జిల్లా

ఫోను: 7702877670

ఇ-మెయిలు: team@kottapalli.in

వెబ్‌సైటు: http://kottapalli.in


కృతజ్ఞతలు:


కొత్తపల్లిని మొబైల్ ఫోన్ల ప్రపంచానికి అందించేందుకు ముందుకొచ్చిన 'న్యూస్ హంట్' వారికి, కొత్తపల్లిలోంచి ఎంపిక చేసిన కథల్ని మరింతగా అలంకరించి శబ్దంతో సహా అందిస్తానంటున్న సింధుగారికి, చేదోడు వాదోడుగా నిలచిన చాలామంది మిత్రులకూ కృతజ్ఞతలు.

# కొత్తపల్లికో సంవత్సర చందా

మిత్రుడు సుబ్బారావు చాలా మంచివాడు. గొప్ప పుస్తక ప్రియుడు. "కవితలు చాలా బాగుంటాయిరా, కానీ ఎందుకనో యీ కాలం పిల్లలెవ్వరూ కవితల పుస్తకాన్ని అంతగా చదవట్లేదు" అన్నాడోసారి.

"నిజమే ఒకప్పుడు తిలక్ "అమృతం కురిసిన రాత్రి" అంటేనూ శ్రీశ్రీ "మహాప్రస్థానం" అంటేనూ తెలుగు జనాలు తెగమెచ్చుకునేవాళ్లు. యీ మధ్య అంతగా నచ్చిన కవితా సంపుటాలు అరుదు" అన్నాన్నేను.

"కవితల వరకూ ఎందుకు? పద్యాలూ అంతే. ఇదివరకు పిల్లలంతా ఎక్కాల పుస్తకాలు కొన్నట్లు వేమనశతకం, సుమతీ శతకం కొనుక్కునేవాళ్లా? ఇప్పుడు ఎవ్వరూ వాటి ఊసే ఎత్తట్లేదు" అన్నాడు సుబ్బారావు.

"వాటిని నేర్పే శక్తి, ఆ ఇష్టం ఉన్న తెలుగు మాస్టార్లూ ఉండాలి కదా. పాపం పిల్లలదేమున్నది, పెద్దలెట్లా అంటే అట్లా తలలూపుతారు" అన్నాన్నేను.

"మరి కథల పరిస్థితీ అదే కద! ఎంత మంచి కథలైనా, చదివేవాళ్లేరీ? పిల్లల్లో చదివేశక్తి పూర్తిగా తగ్గిపోయింది" అన్నాడు సుబ్బారావు, ముఖం బాధగా పెట్టి.

"అదేం లేదు. మంచి కథలు, పిల్లలకి అర్థమయ్యే పదాలు, వాళ్లు మెచ్చే అంశాలు ఉండే కథలు, చక్కని కాగితం మీద, రంగురంగుల బొమ్మల్తో వస్తే, పిల్లలు ఇష్టంగానే చదువుతారు. అయితే ఇందులో ఓ కిటుకున్నది-" ఆపాను నేను-

"ఏంటది?" అడిగాడు సుబ్బారావు.

"ఎంతమంచి పుస్తకాలైనా, పిల్లలమీద ఒక్కసారిగా పడెయ్యకూడదు-చిన్న చిన్న డోసుల్లో, కొద్ది కొద్దిగా రుచి చూపిస్తూ పోవాలి. పుస్తకాల్ని నెల నెలా తెప్పించుకుంటే లాభం అదే. నెలంతా తీరిక ఉండి ఇష్టం కుదిరినప్పుడు చదువుతారు కద, పిల్లలు? తర్వాతి పుస్తకం వచ్చేలోగా యీ నెల పుస్తకాన్ని మూడు మూడు సార్లు చదివేస్తారు! ప్రయత్నించి చూడు మీ పిల్లల్తో కూడా!" అన్నాన్నేను.

"అయితే కొత్తపల్లికో సంవత్సర చందా రాసుకో మరి! నెలనెలా వస్తుందిగా?" అన్నాడు సుబ్బారావు, మూడు వందల రూపాయలు జేబులోంచి తీస్తూ.

Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at “Kottapalli”, 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma